Muslim Personal Law &
Uniform Civil Code
(Telugu)



# ముస్లిం పర్సనల్ లా
# యూనిఫాం సివిల్ కోడ్

మూలం :
సద్రుద్దీన్ ఇస్లాహి
షమ్స్ పీర్జాద

అనువాదం :
ముహమ్మద్ అజీజుర్రహ్మాన్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తా బజార్,
హైదరాబాద్ - 500 002

# ముందు మాట

ముస్లిమ్ పర్సనల్ లా సమస్య ఎంతో తీవ్రతరమయి ముందుకువచ్చింది. ముస్లిములలో అది ఎంతో కలవరాన్ని, ఆందోళనను సృష్టించింది. దీన్ని చూసి మతానికి ఆధునికీకరణ చెయ్యాలని కోరేవారు, నవ నాగరికతా ప్రేమికులు ఈ సమస్యకు లేనిపోని ప్రాధాన్యత ఇవ్వబడుతోందని తలపోస్తున్నారు. ఈ విషయమయి ముస్లిములు కళవళపడిపోవటం సరికాదని, అసలు వారి ఈ కలవరానికి కారణం మతంతోనూ, సనాతన భావాలతోనూ వారికిగల మితిమీరిన అనుబంధమేనని నవనాగరికతా ధ్వజవాహకులు అభిప్రాయపడుతున్నారు. మానవ జీవితం నుండి రాజకీయాలు, ఆర్థిక వ్యవహారాలువంటి రంగాలకు పూర్తి స్వేచ్ఛనిచ్చినట్లే సామాజిక రంగాన్ని జీవితం నుండి పూర్తిగా విముక్తం చేయాలని, అది సర్వ స్వతంత్రంగా ఉండాలని వీరు కోరుతున్నారు. రాజకీయ, ఆర్థిక జగత్తులో చెలామణి అవుతున్న సెక్యులరిజం నాణెం "ఇంట్లో" (కుటుంబంలో) కూడా చెల్లుబాటయ్యేలా చేయాలన్నది వారి ఆకాంక్ష. ఈ రకమయిన ఆలోచనా సరళి గలవారు ఇస్లామ్‌ను కూడా ఇతర మతాల సరసన నిలబెడుతున్నారు. ఇస్లామ్ దైవం సమ్మతించి ఆమోదించిన ధర్మమన్నది, అది ఒక పరిపూర్ణ జీవన వ్యవస్థ అన్నది వారి బుద్ధికందదు. ఇస్లామ్ సామాజిక నియమాలు, చట్టాలు

ఒకవేళ దైవం తరఫున అవతరింపజేయబడినవే అయినప్పటికీ వాటిని కాలానుగుణంగా సవరించుకునే హక్కు మొత్తమ్మీద మనిషికి ఉండాల్సిందేనన్నది వారి అభిమతం. చూడబోతే, ముస్లిమ్ పర్సనల్ లా గురించి సరిగా తెలీనివారు కూడా అధికం గానేవున్నారు. ముస్లిమ్ పర్సనల్ లా ను సమర్థిస్తూ ముస్లిములు ప్రకటనలు చేసినా లేక తమ పర్సనల్ లా లో ఇతరుల జోక్యాన్ని నిరసించినా, అదంతా అనవసరమైన రోదన అని ఈ ప్రబుద్ధులు తేలిగ్గా కొట్టివేస్తారు. వీళ్ళ దృష్టిలో ముస్లిమ్ పర్సనల్ లా అంటే భావం, ఒకటికన్నా ఎక్కువ వివాహాలు చేసుకోవటానికి అనుమతినిచ్చే చట్టం అన్నది మాత్రమే. అందువల్ల ఒక భార్య ఉండగా మరో వివాహం చేసుకునేందుకు ఇస్లామ్ 'అనుమతి.' భార్యల మధ్య న్యాయం చెయ్యగలిగే షరతుపైనే ఇచ్చింది. అదీ కేవలం 'అనుమతే' గాని 'ఆదేశం' కాదు. అటువంటప్పుడు ఒకటికన్నా ఎక్కువ వివాహాలు చేసుకోవటాన్ని నిషేధిస్తూ చట్టం చేసినట్లయితే దానివల్ల షరీఅత్‌కు కలిగే ముప్పు ఏమిటి ?— ఇదీ వారి వాదన. ముస్లిమ్ పర్సనల్ లా ను రూపుమాపటంవల్ల గాని, ఉమ్మడి సివిల్ కోడ్‌ను విధించటంవల్లగానీ ఎలాంటి హాని కలగబోదన్నది వారి అభిప్రాయం. ఎందుచేతనంటే ఈ మార్పు వివాహాది వ్యవహారాలకు మాత్రమే పరిమితమై ఉంటుం దని వారు తలపోస్తున్నారు. పాపం వీరికి ముస్లిమ్ పర్సనల్ లా పరిధుల్ని గురించిగానీ, యూనిఫాం సివిల్ కోడ్ పరిధి గురించిగాని సరైన అవగాహనే లేదు. వారు ముస్లిమ్ పర్సనల్ లా కు గల ధార్మిక ప్రాముఖ్యాన్నిగాని, సమానమైన సివిల్ కోడ్ **(Uniform Civil Code)** మూలంగా ఇస్లామీయ షరీఅత్‌కు

చెందిన ఏ ఏ నియమాలు, ఆదేశాలు సవరణల వాతన పడవలసి వస్తుందోనన్న విషయాన్నిగాని ఊహించలేకపోతున్నారు. అందుచేత ముస్లిమ్ పర్సనల్ లా ను, దాని ప్రాముఖ్యాన్ని విడమరచి చెప్పవలసిన ఆవశ్యకత, యూనిఫాం సివిల్ కోడ్‌ను వెనకేసుకు వచ్చేవారు ఇస్తున్న ఆధారాలను పరిశీలించవలసిన అవసరం ఎంతయినా ఉంది. ఒకవేళ యూనిఫాం సివిల్ కోడ్‌ను క్రోడీకరించి, దాన్ని ప్రవేశపెట్టే అవస్థే గనక దాపురిస్తే అప్పుడు దాని రూపురేఖలు ఎలా ఉంటాయో, ముస్లిముల కొరకు అది ఏ ఏ సమస్యల్ని తెచ్చిపెడుతుందో, మరెలాంటి ఇక్కట్లలో వారిని పడవేస్తుందో ఎరుకపరచటం కూడా అవసరమే. ఎందుకంటే వారి మనోవేదన, ఆందోళన అర్థరహితమయినది కాదు, పైగా అది వారి మౌలిక విశ్వాసాలతో ముడిపడి ఉన్న సమస్య అని. ఇంకా అది, వారు విశ్వసించి ఆచరించే ధర్మం వారి నుండి కోరుతున్న సహజమైన విషయమని చాటిచెప్పవలసిన ఆవశ్యకత ఉంది.

— ప్రకాశకులు

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# ముస్లిమ్ పర్సనల్ లా

## చట్టం ఆవశ్యకత

చట్టం— అది మనిషి జీవితపు ఏ రంగానికి సంబంధించినదైనా— మానవునికి, మానవ నాగరికతకి ఒక అనివార్యమయిన అవసరం. అది లేకుండా మానవ ఔన్నత్యమూ లేదు, సంస్కృతి అన్నదీ ఉండదు. చట్టం వల్లనే మానవ సమాజం 'సమాజం'గా రూపొందుతుంది. దీని మూలంగానే వ్యక్తుల హక్కులు పరిరక్షించబడతాయి. సామాజిక వ్యవస్థకు రక్షణ, పటిష్టతగానీ దీనిద్వారానే చేకూరుతాయి. అన్యాయం, అధర్మాల వల్ల కలిగే వినాశం నుండి రక్షణ, శాంతి దీని వల్లనే లభిస్తాయి. ప్రజలకు న్యాయం, సంతృప్తి దీనిద్వారానే ప్రాప్తమవుతాయి. మానవ నాగరికత మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లడానికి అవకాశం లభిస్తుంది. చట్టం రక్షణే గనక లేకపోతే ఎటు చూసినా అంతా లోపభూయిష్టంగా గోచరిస్తుంది. చట్టాలు లేని మానవ సమాజాల్లో ఆటవిక న్యాయం తాండవిస్తుంది. అందుచేత చట్టం, న్యాయస్థానాల స్థాపన మనిషికి అత్యంత అవసరమయింది. ఇంకా మానవ నైజం కూడా దాన్ని వాంఛిస్తుంది.

ఎట్టి పరిస్థితిలోనూ మనిషి దానికి అతీతుడు కాలేడు అనేది యదార్థం.

## ఉన్నత చట్టం : దాని మౌలిక గుణాలు

ఈ యదార్థం, చట్టానికి రెండు గుణాలు అవసరమం టోంది —

(1) ఒకటేమంటే, అది, సమాజ సాఫల్యానికి, దాని పురోగతికి నిజంగా ఉపయోగపడేదై ఉండాలి. ఎందుకంటే అసలు చట్టం ఉనికిలోకి వచ్చింది ఈ ఆశయం కొరకే. ఆ ఆశయం కోసమే మనిషి దాని (చట్టం) బంధనాలను తనపై విధించుకున్నాడు. అందుచేత ఏ సమాజంలోనయినా ఈ ఆశయం నెరవేరని చట్టంగనక అమల్లో ఉన్నట్లయితే ఆయా ప్రజలు చేసే ఈ తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యాల త్యాగం అనవసర మనే భావించవలసి ఉంటుంది. అటువంటి పరిస్థితుల్లో ఆ 'చట్టం' అనబడేదాన్ని విధించడంలో ఎలాంటి హేతువూ మిగలదు. ఇంకా అది ఆ సమాజంలో సహించదగినదిగా కూడా ఉండరాదు.

(2) రెండో విషయం ఏమంటే, చట్టం అన్నది సమాజం యొక్క మౌలిక భావాలు, భావనలకు సరిపడేదిగా ఉండటం అవసరం. ఇంకా అవి దాని నాగరికతా సూత్రాలు ప్రమాణా లకు ప్రతిబింబించేవిగా ఉండాలి. ఆ సమాజపు భావావేశాలకు ప్రతిరూపంగా ఉండాలి. సముచితమయిన, ఫలప్రదమయిన చట్టం యొక్క లక్షణం ఏమంటే, ఏ ప్రజలపై అది విధించ బడిందో వారు మానసికంగా దానికి సన్నిహితులయి ఉండాలి.

ఇంకా ఆ చట్టం పట్ల ఆ ప్రజల్లో గౌరవభావం ఉండాలి. మనస్ఫూర్తిగా దానికి కట్టుబడి ఉండేందుకు వారు అంగీకరించాలి. అంతేగాని ఆ ప్రజలు ఆ చట్టాన్ని భరించరాని భారంగా భావిస్తూ, ఎలాగైనా ఆ శిరోభారాన్ని వదిలించుకునే ఆలోచనలో ఉండరాదు. వారు దానితో దాగుడుమూతలాడరాదు. ఏ చట్టంలోనయినా ఆ గుణాలు ఎప్పుడు వస్తాయి? సమాజంలో క్రియాత్మకంగా దానికి ఆ స్థానం ఎప్పుడు సంప్రాప్తమవుతుంది? అది ఆ సమాజపు నియమాలను, దాని విలువలను ఆకళింపు చేసుకుని తనలో జీర్ణం చేసుకోగలిగినప్పుడు! దాని వేళ్ళు ఆ సమాజపు భావాలు భావనలతో పాతుకుపోయినప్పుడు!! హేతువు అనుభవాలు రుజువు చేసే సత్యమిది.

ఆలోచిస్తే, ఈ రెండు విషయాల్లో రెండోది మొదటిదాని కన్నా ముఖ్యమయినదే కాదు, అది మొదటిదానికి చాలావరకు ప్రాతిపదికగా కూడా వ్యవహరిస్తుంది అన్న విషయం బోధపడుతుంది. ఎందుకంటే ఏ చట్టమయినా ఆ సమాజ నియమాలు, విలువలు, భావాలు, భావనల ద్వారా రూపొందనంతవరకు అది శ్రేయోసాఫల్యాలకు ఉపయోగపడే సాధనం అనిపించుకోదు. కాబట్టి చట్టం యొక్క పునాది కేవలం సామాజిక నియమాలు, విలువలపై ఉండాలి. ఇది ఆది మరియు అంతిమ అవసరం. అలా కాకపోతే అదొక మంచి శాసనమూ కాలేదు, సమాజానికి శ్రేయోసాఫల్యాలు చేకూర్చనూ లేదు. ఇవేమీ అది చేయలేనప్పుడు ప్రజల నెత్తిపై కూర్చునే అధికారం కూడా దానికి ఉండకూడదు. ఇలాంటి "చట్టాన్ని" ఏ జాతి అయినా తన కొరకు నిర్మించుకుంటే నిజానికది దాని సంస్కృతీ నాగరికతలకు

ఆత్మహత్యా సదృశమయిందే. ఒకవేళ వేరే శక్తి ఏదయినా దానిపై అటువంటి చట్టాన్ని రద్దిత్తే అది ఆ జాతి నాగరికత హత్యగా అనుకోవలసివస్తుంది.

## ముస్లిం పర్సనల్ లా ఏ తరహా చట్టం ?

చట్టం గురించిన అత్యంత ముఖ్యమయిన ఈ సూత్ర ప్రాయమయిన యదార్థాన్ని దృష్టిలో ఉంచుకుని మరీ 'ముస్లిమ్ పర్సనల్ లా' (ముస్లిమ్ వ్యక్తిగత చట్టం) అనబడే ఈ చట్టాన్ని, దానికి సంబంధించిన సమస్యను పరిశీలించండి. ఈ చట్టం పేరునుబట్టి 'ముస్లిముల వ్యక్తిగత చట్టం' అవడానికి భావం, స్పష్టంగా తెలిసేదేమంటే— అది ముస్లిమ్ సమాజ (మిల్లత్) స్వభావ స్వరూపాలతో ప్రత్యేక సంబంధం కలిగి ఉందనీ, ఇంకా అది మిల్లత్ ప్రత్యేక సిద్ధాంతాలు, దృక్పథాలకు ప్రతీక అని, దాని సూత్రాలు, ప్రమాణాల ప్రతిబింబమని కూడా విదితమవు తోంది. అదేకాకపోతే అసలది ఉనికిలోకి వచ్చేదే కాదు. 1400 ఏళ్ళుగా ముస్లిముల్లో చెలామణి అయి ఉండేదే కాదు. అందు చేత ఈ చట్టం గురించి యోచించేటప్పుడు లేక చర్చించేటప్పుడు, మిల్లత్‌తో దానికున్న ప్రత్యేక అనుబంధం ఏమిటో, ఈ చట్టానికి మూల సాధనాలయిన ముస్లిముల భావాలు, దృక్పథాలకు అది ఏ విధంగా అద్దంపడుతోందో పరిశోధించి నిర్ణయానికి రావటం ముఖ్యావసరమేకాదు అనివార్యం కూడాను. ముస్లిములు భౌగోళికంగానో, జాతి ప్రాతిపదికపైనో, భాషా ప్రధానంగానో లేక అలాంటివే ఇతర ఆధారాలుగానో ఉనికిలోకి వచ్చిన 'జాతి' ఎంత మాత్రం కాదు— అదొక ప్రత్యేకమయిన సైద్ధాంతిక సమాజం.

సూత్రబద్ధమయిన సంఘం. ఈ యదార్థం దృష్ట్యా రెండు విషయాలకు ఆస్కారముంది. ముస్లిమ్ పర్సనల్ లా కు పునాది అయిన ముస్లిమ్‌ల ప్రత్యేక స్వభావం, వారి భావాలు, భావనలు (1) కేవలం వారి జాతి జీవనపు ప్రత్యేక నాగరిక పరిస్థితులు, సామాజిక ప్రయోజనాల దృష్ట్యా ఉత్పన్నం కావడం, (2) ఇంకా ముందుకుపోయి అవి వారి సైద్ధాంతిక సూత్రప్రాయమయిన స్థాయికి సహజ పర్యవసానంగా ఉనికిలోకి రావడం.

ప్రపంచ చట్టాల నిధిలో ఈ రెండు రకాల వ్యక్తిగత చట్టాలు కానవస్తాయి. ఒక జాతి వ్యక్తిగత చట్టం మొదటి తరహాకు చెందినదయితే ఇంకొక జాతి చట్టం రెండో తరహాకు చెందినదై ఉంటుంది ముస్లిమ్ పర్సనల్ లా ఈ రెంటిలో ఏ రకానికి చెందినదయినా వాటిలో ఎంతో వ్యత్యాసముంటుంది. మొదటి తరహా ప్రకారమైతే— ఈ శాసనం కేవలం ముస్లిముల జాతీయ ప్రత్యేకత, వారి సామాజిక వ్యక్తిత్వాల ప్రాముఖ్యం కలిగి ఉంటుంది. అప్పుడు అది, ముస్లిములు తమ ఇష్టపూర్వకంగా స్వయంగా నిర్మించుకున్న కొన్ని ఆచార సంప్రదాయాల సముదాయం మాత్రమే. ఆ కారణంగా అవి సాంప్రదాయకంగా వారి జీవన వ్యవస్థలో ఒక భాగమైపోయినై అని చెప్పవలసి ఉంటుంది. రెండవ తరహా ప్రకారమయితే— ఈ చట్టం సరాసరి వారి విశ్వాసాలతో, జీవన నియమాలతో ముడిపడి ఉంది. ఇంకా అది వారు విశ్వసించే ధర్మం, వారి షరీఅత్‌లోని ఒక భాగం అయిపోతుంది. ఆ ధర్మాన్ని, ఆ షరీఅత్‌ని సంపూర్ణంగా అనుసరించడమే వారు ముస్లిములు అవడానికి, ముస్లిములుగా మనడానికి అనవాలు. మరో మాటలో చెప్పా

లంటే ఈ చట్టం అసలు వారిచేత నిర్మించబడినది కాదు, వారూ స్వయంగా దానిచేత 'నిర్మించబడినవారు.' ఈ చట్టాన్ని అర్థం చేసుకోవడానికి, దాన్ని గురించి ఒక అభిప్రాయానికి రావడానికి గాను దాని పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉంది. అయితే అసలిది ఏ తరహాకు చెందింది? మొదటి తరహాకా? రెండో తరహాకా? అనే ప్రశ్న ఉత్పన్నమయాక దాని పూర్వాపరాలను పరిశీలించడం మరింత అవశ్యమైపోయింది.

ఎందుకంటే, ఈ ప్రశ్నకు సమాధానం దొరకనంతవరకు, ఈ చట్టం నిజస్థాయి ఏమిటో నిర్ధారించుకోలేనంతవరకు దీని గురించి ఏ చర్చనూ కొనసాగించనేలేము. ఒకవేళ అలాగే గనక ఆ చర్చను మొదలెడితే అది పరిశోధనాత్మకమూ అనిపించుకోదు, శాస్త్రీయమూ కాదు. పైగా అది వాస్తవికమయిందీకాదు, నిజాయితీతో చేసిందీ కాజాలదు. అందుచేత తొలుత ఈ మౌలిక యదార్థాన్ని వెతికి, ఒక దృఢ అభిప్రాయానికి రావాలి. అప్పుడుగాని చర్చను సిసలయిన గాడిలో వేయలేము.

## పరిశోధనకు సరయిన పద్ధతి

ఈ విషయంలో రెండు అభిప్రాయాలకు తావులేదు. హేతుబద్ధంగా దీన్ని పరిశోధించే సముచితమయిన, సరయిన పద్ధతి ఒక్కటే కాగలదు. అదేమంటే, ముస్లిములు తాము అవలంబిస్తున్న ధర్మాన్ని అధ్యయనం చేయాలి. దాని మూలాధారాలయిన ఖుర్ఆన్ మరియు మహాప్రవక్త (సఅసం) సంప్రదాయాన్ని క్షుణ్ణంగా పరిశోధించి, నేడు దేన్నయితే 'ముస్లిమ్

పర్సనల్ లా' అని పిలుస్తున్నారో దాని ఉనికి వాటి పుటల్లో ఎక్కడయినా ఉందో లేదో చూడాలి. ఒకవేళ ఉంటే ఏ స్థాయిలో ఉంది? ఏపాటి ప్రాముఖ్యతతో ఉంది? అనేదాన్ని పరికించాలి. ఈ పరిశోధనలో, ఒకవేళ ఖుర్అన్‌లోగానీ, హదీసులలోగాని ఈ చట్టం ప్రస్తావన ఎక్కడా కనబడకపోతే, ధార్మికంగా దానికంటూ ఏ స్థానమూ లేదన్న విషయం విస్పష్టమైపోతుంది. ఇక దానికి ఏదయినా ప్రాముఖ్యత ఉంటే అది కేవలం జాతీయత దృష్ట్యానో, లేక సాంస్కృతికంగానో ఉందని భావించాలి. ఒకవేళ యదార్థం మరోలా ఉన్నట్లయితే దీని అసలు యదార్థం కూడా భిన్నంగానే ఉంటుంది. అప్పుడు ఈ చట్టానికున్న ధార్మిక స్థానాన్ని, షరీఅత్ స్థాయిని ఒప్పుకోవటం తప్పనిసరి అవుతుంది.

## ముస్లిం పర్సనల్ లా – నిరూపిత సత్యాలు

ఖుర్అన్, హదీసులను పరిశీలిస్తే స్పష్టమయినవీ, విభేదాలకు తావులేనివీ కొన్ని యదార్థాలు మన ముందుకు వస్తాయి. అవేమంటే ;

## 1. ఓ ముఖ్య అధ్యాయం

మొదటి యదార్థం ఏమంటే ముస్లిముల కుటుంబ జీవితం, వారి వ్యక్తిగత వ్యవహారాల విషయంలో ఖుర్అన్ హదీసులలో ఆదేశాలు, ఉపదేశాలు ఉన్నాయి. ఉండటమేమిటీ ఎంతో విపులంగా ఉన్నాయి. కనుక వాటి పేజీలను తిరగేస్తూ ఆయా

ఆదేశాలను, ఉపదేశాలను పరిశీలిస్తూ ముందుకు సాగండి— నికాహ్, మహర్, మనోవర్తి, తలాక్, ఖులా, ఈలా, ఇద్దత్, వంశ నిర్ధారణ, వారసత్వం, వీలునామా, పిల్లల పెంపకం, కుటుంబ పోషణ, వక్ఫ్ హిబా— మొదలగు అంశాలలో ఏ ఒక్కదాన్నీ అవి స్పర్శించకుండా, మార్గదర్శక సూత్రాలు సూచించకుండా, నియమాలను నిర్ధారించకుండా, శాసనాలను నిర్ణయించకుండా వదలివేయలేదన్న సంగతి మీకు సుబోధకమవుతుంది. ఇది ఎంత బహిరంగమయిన యదార్థమంటే దీనికి సంబంధించిన దైవ గ్రంథ వాక్యాలను, మహా ప్రవక్త (సఅసం) ప్రవచనాలను ఇక్కడ ఉటంకించవలసిన అవసరమే లేదు. ఎవరయినా ఈ లోతుల్లోకి పోదలిస్తే దివ్య ఖుర్ఆన్ అనువాదాన్ని చూసుకుంటే చాలు— దాన్ని ధృవపరచుకోగలడు.

యదార్థం ఇంతేకాదు, ఈ వ్యక్తిగత చట్టాలు ఖుర్ఆన్— హదీసులలో ఉండటమే కాదు, అవి ఎంతో స్పష్టంగా కూడా ఉన్నాయి, మరెంతో విపులంగానూ ఉన్నాయి. దివ్య ఖుర్ఆన్‌లో ఇవి ఎంత విపులంగా వివరించబడ్డాయంటే, అంత చక్కని విపులీకరణ జీవితపు మరే రంగానికి సంబంధించిన ఆదేశాలలోనూ కానరాదు. ఆఖరికి నమాజ్, రోజా, జకాత్ వంటి మౌలిక ధార్మిక విషయాలు కూడా ఇంతగా విడమర్చి చెప్పబడలేదు. ఈ ఒక్క ఆధారం చాలు అందులో నిగూఢ మయిన పరమార్థం ఉందనడానికి. ఈ పరమార్థాన్ని నిర్ధారించే విషయంలో అనేక అభిప్రాయాలుంటే ఉండడం సాధ్యమే. కాని వ్యక్తిగత చట్టాల విషయమై అసాధారణ రీతిలో వివరాలు ఇవ్వటం ఖుర్ఆన్ దృష్టిలో వాటికున్న ప్రత్యేక ప్రాముఖ్యతకు ప్రతీక అనడంలో మాత్రం రెండు అభిప్రాయాలకు తావు లేదు.

# II. దైవాదేశాలననడానికి నిదర్శనాలు

ఖుర్‌ఆన్, హదీసులలో ఏ ఆదేశానికి సంబంధించిన ప్రస్తావన అయినా వచ్చిందంటే దాన్ని పాటించడం ముస్లిములకు విధిగా నిర్ణయించబడిందన్న మాటే. ఆ విషయం గురించి ఇంకా వేరుగా విడమరచి చెప్పవలసిన అవసరమే లేదు. కాబట్టి ప్రస్తుత చర్చనీయాంశమైన వ్యక్తిగత చట్టాలు ఖుర్‌ఆన్ హదీసులలో ఉండగా, వాటిని అనుసరించడం కూడా తప్పనిసరి అనడంలో సందేహమే లేదు. అయితే ఖుర్‌ఆన్ సూత్రప్రాయమయిన ఈ యదార్థం దృష్ట్యా ఈ చట్టాలను కేవలం ఎరుక పరచడం మాత్రమే కాదు. దానితోపాటు అడుగడుగునా వాటిని విధిగా నిర్ణయించిన విషయాన్ని, అవి తప్పనిసరిగా అనుసరించవలసినవి అన్న విషయాన్ని స్పష్టంగా వివరిస్తూపోయింది కూడా. ఉదాహరణకు 'నికాహ్' గురించి కొన్ని ఆదేశాలిచ్చిన తరువాత ఒక చోట ఇలా సెలవియ్యబడింది :

"అల్లాహ్ మీపై (ఈ చట్టాలను) విధిగా నిర్ణయించాడు."
[నిసా – 24]

మరో చోట ఏమనబడిందంటే :

"ఇది అల్లాహ్ ఆజ్ఞ. ఆయన మీ మధ్య తీర్పు చేస్తాడు."
[ముమ్తహినా – 10]

ఇదే విధంగా తలాక్, ఖులా గురించి కొన్ని ఆదేశాలు వివరించి ఇలా హెచ్చరించబడింది—

"ఇవి అల్లాహ్ విధించిన హద్దులు. వీటిని అతిక్రమించకండి."
[అల్ బఖర - 229]

'ఇద్దత్'కు సంబంధించిన కొన్ని మార్గదర్శక సూత్రాలు చెప్పిన తరువాత బాధ్యతను జ్ఞాపకం చేయడం జరిగింది:

"ఇది అల్లాహ్ ఆజ్ఞ. దీన్ని ఆయన మీ వద్దకు పంపాడు."
[తలాఖ్ - 5]

మరో చోట తలాక్ మరియు ఇద్దత్‌కు సంబంధించిన కొన్ని ఆదేశాలిచ్చి, వాటిని అల్లాహ్ నిర్ణయించిన హద్దులుగా పేర్కొనడం జరిగింది.

"ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు............"
[తలాక్ - 1]

ఇక వారసత్వపు చట్టాల విషయంలోనయితే ఈ విపులీకరణ అసాధారణ రీతిలో ఉంది. అందుకే వాటిని గురించి చెప్పటం ప్రారంభించినపుడు పీఠికలోనే నిక్కచ్చిగా ఇలా చెప్పబడింది:

"తల్లిదండ్రులు, దగ్గర బంధువులు విడిచి వెళ్ళిన ఆస్తిలో పురుషులకు భాగం ఉంది. తల్లిదండ్రులు, దగ్గర బంధువులు విడిచివెళ్ళిన ఆస్తిలో స్త్రీలకు కూడా భాగం ఉంది — అది తక్కువయినా సరే, ఎక్కువయినా సరే. ఈ భాగం (అల్లాహ్‌చే) నిర్ణయించబడింది."
[అన్ నిసా - 7]

ఇక అసలు చట్టాల ప్రస్తావన ఈ పదాలతో మొదలవుతుంది:

"అల్లాహ్ మీ సంతానం విషయంలో మీకు ఆదేశిస్తున్నాడు........"
[నిసా - 11]

ఆ తరువాత ఆ చట్టాలకు సంబంధించిన ఒక భాగం అవగానే ;

"ఈ భాగాలను అల్లాహ్ నిర్ణయించాడు. నిశ్చయంగా అల్లాహ్ యదార్థాలన్నీ తెలిసినవాడు, మర్మహేతువులన్నీ ఎరిగినవాడు." [నిసా - 11]

అని గుర్తుచేయటం జరిగింది.

ఇక ఈ అస్తిపంపకాల వివరణ ముగింపు కూడా ఏ పదాలతో జరిగిందో గమనించండి :

"అల్లాహ్ అన్నీ తెలిసినవాడు. అత్యంత సహనశీలుడూను. ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు ........"
[నిసా - 12, 13]

ఈ విధంగా ఈ వారసత్వ చట్టాల గురించి ఒకటి కాదు, రెండు కాదు ఐదుసార్లు చెప్పటం జరిగింది. చెప్పిన విషయాన్ని మార్చి మార్చి కొత్త కొత్త రీతుల్లో నొక్కి పలకడం జరిగింది. ఇవి అల్లాహ్ నిర్ణయించిన, మన కోసం తప్పనిసరి చేసిన చట్టాలన్న సంగతి మన మనోక్షేత్రంలో నాటడం జరిగింది.

దివ్య ఖుర్ఆన్ చేసిన ఈ స్పష్టీకరణ తరువాత కూడా, ఈ చట్టాలు ముస్లిమ్‌లకు ఎప్పుడయినా అనవసరం కూడా కాగలవని, వీటిని మానవ నిర్మిత శాసనాల స్థాయిలో కూడా ఉంచవచ్చని ఎంత అసమంజసమయిన తర్కం ద్వారానయినా దీన్ని సమర్థించలేదు.

## III. ఇస్లామీయ విలువలు

మూడవ విషయం ఏమంటే ఈ చట్టాల్లో ఇస్లామ్ మౌలిక సూత్రాలు, ఆశయాలు అంతర్లీనంగా, వాటి రక్షక కవచంగా కూడా వ్యవహరిస్తాయి. ఇస్లామ్ ధర్మంలోని సారమే వాటికి ఊపిరిగా ఉపకరిస్తుంది. ఈ విధంగా అవి ముస్లిమ్‌ల వ్యక్తిగత జీవితపు వ్యవహారాలను క్రమబద్ధం చేసే సాధనాలే కావు, అవి వారిలో విశ్వాసం కోరే గుణాలను, ఇస్లామీయ విలువలను పెంపొందించేందుకు అవసరమయ్యే ఆధారం కూడాను. ఉదాహరణకు నికాహ్ విషయాన్నే తీసుకోండి. ఇస్లామ్ మౌలిక శాసనం ప్రకారం బహుదైవోపాసకునితో ఏకేశ్వరోపాసకుని వివాహం జరగడానికి వీల్లేదు. దానికి ఖుర్ఆన్ పేర్కొన్న కారణం ఏమిటంటే, అటువంటి వైవాహిక సంబంధం ముస్లిమ్‌లను విశ్వాసం మరియు ఇస్లామ్ అనే సంపదకు, పరలోక సాఫల్యానికి నోచుకోకుండా చేస్తుంది [అల్ బఖర – 221]. విశ్వాస భాగ్యమే ఒక ముస్లిమ్‌కు అన్నింటికన్నా విలువయిన ఆభరణం గనుకను, పరలోక సాఫల్యమే అతని నిజ ధ్యేయం గనుకను. దాని పరిరక్షణ ఇస్లామ్‌లో ఒక మౌలిక సూత్రం కావడం తప్పనిసరి. దాని కోసం బహుదైవోపాసకులతో నికాహ్‌ను నిషిద్ధంగా ఖరారు చేయడం సముచితమే కాదు ఒక అనివార్య అవసరమూ అయిపోయింది. ఇదే విధంగా ఇస్లామ్, న్యాయం చేయగలిగే పక్షంలో ఒకటి కంటే ఎక్కువ వివాహాలు చేసుకునేందుకు కూడా అనుమతిని ఇచ్చింది. దాని ద్వారాలను అది మూసివేయలేదు. ఈ అనుమతి కూడా అసంఖ్యాకమయిన సామాజిక, నైతిక ప్రయోజనాలను, పరమార్థాలను దృష్టిలో ఉంచుకునే ఇవ్వబడిం

దని మరువరాదు. ముఖ్యంగా అనాధల హక్కులు, ప్రయోజనాలు ఈ సందర్భంగా దృష్టిలో పెట్టుకోవడం జరిగింది.

(నిసా : 3).

మరో దృష్టాంతం— విడాకులనే తీసుకుందాం. ఇస్లామ్ దాంపత్య బంధాన్ని అన్నింటికన్నా ముఖ్యమయిన, గౌరవప్రదమయిన సంబంధంగా ఖరారు చేసినప్పటికీ, అది విడాకులు, వేర్పాటుకై అవకాశాన్ని కల్పించింది. ఇలా చేయడంలోని ప్రధాన ఉద్దేశ్యం, అనునిత్యం దైవాదేశాల ఉల్లంఘన జరగకుండా చూడటమేనని కూడా చెప్పబడింది [అల్ బఖర – 229]. అంటే పరస్పరం అయిష్టత ఏర్పడి, ద్వేషభావం పెరిగిన కారణంగా దాంపత్య జీవిత ధ్యేయం భార్యాభర్తలిద్దరి దృష్టికీ మరుగైనప్పుడు, ఇక వారిద్దరి మధ్య సఖ్యతకు, సర్దుబాటుకు అవకాశం లేదనుకున్నప్పుడు ఆ సంబంధాన్ని అలాగే కొనసాగించడం ఎంతకీ శ్రేయస్కరం కాదు. అలా కొనసాగనివ్వడం ఆ ఇరువురి నైతికత, నడవడికలు సతతం కళంకభూయిష్టం చెయ్యడమే. దైవం, పరస్పరం వారిద్దరిపై మోపిన హక్కులు బాధ్యతలను సర్వనాశనం చెయ్యడమే. అదే జరిగితే అది సమాజం పాలిట అభిశాపం అవుతుంది. బహిరంగ ఉపద్రవానికి దారితీస్తుంది. ఇస్లామ్, జీవితపు ఏ విభాగంలోనూ కలతను, ఉపద్రవాన్ని, అరాచకాన్ని సుతరామూ సహించదు. అందువల్లను, ఆ దంపతులు విడిపోతేనేగాని ఆ రగడకు నివారణ అసంభవమయినందువల్లనూ ఆ లక్ష్యసాధనకై ఇక వారిద్దరూ ఉత్తమ రీతిలో వేరుపడటానికి అనుమతి ఇవ్వటమే మేలని ఇస్లామ్ భావిస్తోంది.

ఈ కొన్ని ఉదాహరణల ద్వారా— ఇస్లామ్ వ్యక్తిగత

చట్టాలు కేవలం చట్టాలేకావని, అవి ఇస్లామ్ ఆశయాలు, ప్రమాణాలను సాధించేవిగా కూడా అనే విషయం సులభంగా ద్యోతకమవుతుంది.

## IV. విశ్వాసానికి మోక్షానికి షరతు

ఖుర్‌అన్ ఉపదేశాల ద్వారా విస్పష్టమయ్యే నాల్గవ యదార్థం ఏమంటే, ఈ చట్టాలను అమలుజరపడం విశ్వాసానికి తప్పనిసరి పర్యవసానమని, పరలోక సాఫల్యానికి మూలాధారమని తెలుస్తోంది. ఇదొక షరతు. ఈ యదార్థాన్ని ప్రత్యేకంగా వివరించవలసిన అవసరం అసలు లేకుండింది. ఎందుకంటే దైవ గ్రంథం, దైవ ప్రవక్త (సఅసం) ప్రవచనాలలో అవి ప్రస్తావించబడ్డాయి. ఆ ప్రస్తావనే చాలు, ముస్లిమయిన ఒక వ్యక్తి వాటిని ఆచరించడం తప్పనిసరి అని, అది అతని ధర్మం మరియు విశ్వాసాల అనివార్యమైన పర్యవసానమని చాటడానికి. అయినప్పటికీ కొందరు ఈ విషయంలో మొండి ధోరణిని అవలంబించి 'ఒక చట్టం ఖుర్‌అన్‌లో ప్రస్తావించబడినంత మాత్రాన, అల్లాహ్ నిర్ణయించినదిగా చెప్పబడినంత మాత్రాన అది ఖచ్చితంగా ధార్మిక ప్రతిపత్తి కలిగి ఉండనవసరం లేదు, షరీఅత్‌లో భాగమూ కానవసరం లేదు, అది ప్రాపంచిక చట్టమూ కావచ్చు. ధార్మిక ప్రాముఖ్యతలేని చట్టమూ కావచ్చు. ఇక ఏ ఖుర్‌అన్ ఆదేశం ధార్మికమయింది, ఏది ప్రాపంచికమైంది అనేది దానితో సంబంధమున్న వ్యవహారాన్ని బట్టి నిర్ధారించవలసి ఉంటుంది. వ్యక్తిగత చట్టాలతో సంబంధం కలిగి ఉన్న వ్యవహారాలు స్వచ్ఛంగా ప్రాపంచికమయినవి అయినందున వాటిని కూడా

ప్రాపంచికమయినవిగా భావించడానికి కనీసపు అవకాశమయితే ఉండనే ఉంది' అని వారు వితండవాదం చేస్తారు.* అందుచేత ఈ ఆదేశాల గురించి ఖుర్ఆన్ చేసిన వివరణను కూడా గమనించటం అవసరం. అదేమంటే, ఇవి ఎటువంటి ఆదేశాలంటే విశ్వాసులయినవారు వాటిని విధిగా పాటించాలి. వాటిని పాటించడం దైవ భక్తికి అనివార్య పర్యవసానం. వాటిని అతిక్రమించడం, అధర్మం, అన్యాయం, పాతకం, దైవధిక్కారం, దేవుని శిక్షకు పాత్రమయిన నేరం అవుతుంది అందుకే వార

---

* ఇదేదో ఊహాజనిత విషయం కాదు. యదార్థ విషయమే. డాక్టర్ గజేంద్ర గడ్కర్ వంటి మేధావి "భారతదేశ సమైక్యత" అనే అంశంపై ఉపన్యసిస్తూ, ముస్లిమ్ వర్గం కొరకు సెక్యులరిజం చూపే బాటేమిటంటే, కామన్ సివిల్ కోడ్ విషయంగానీ, బహు భార్యత్వాన్ని నిషేధించే విషయంగానీ ఖుర్ఆన్ ఆధారంగా కాదు, సామాజిక ప్రాతిపదికల ఆధారంగానే పరిశీలించడం జరగాలి అని ఘంటాపథంగా అన్నాడు. [ఖౌమీ ఆవాజ్ : 16-12-1970]

అలాగే ప్రొఫెసర్ ఫైజి (దురదృష్టవశాత్తు ఇతనూ ముస్లిమ్ పర్సనల్ లా లో ఆరితేరిన నిపుణుడుగా పరిగణించబడుతున్నాడు) ఓసారి ప్రసంగిస్తూ ఇలా అభిప్రాయపడ్డాడు— "పవిత్ర ఖుర్ఆన్ వాదోపవాదాలకు అతీతమయిన దైవవాణి. అయితే అందులో ఉన్న కొన్ని విషయాలను మార్చివేయవలసిన అవసరం కూడా ఉంది. ఉదాహరణకు— బహుభార్యాత్వం, పరదా, తలాక్."

[స్టేట్స్‌మన్ (ఢిల్లీ)— మొదటి పేజీ, 8వ కాలమ్, తేదీ 11-8-1970]

ఒకవైపు ఏదేని ఆదేశాన్ని అది ఖుర్ఆన్‌లో ఉందని ఒప్పుకుంటూనే, మరోవైపు దాన్ని ఉపేక్షించతగిందిగా, మార్చదగిందిగా

సత్వపు పట్టాలను గురించి పేర్కొన్న తరువాత సెలవియ్య బడింది :

> "ఇవి అల్లాహ్ విధించిన హద్దులు. అల్లాహ్‌కు ఆయన ప్రవక్తకు ఎవరైతే విధేయత చూపుతాడో అతణ్ణి అల్లాహ్, క్రింద సెలయేర్లు ప్రవహించే ఉద్యానవనాల్లోకి ప్రవేశింప జేస్తాడు ఆ వనాల్లో అతడు కలకాలం ఉంటాడు. అసలు ఇదే గొప్ప సాఫల్యం. ఎవరైతే అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు అవిధేయత చూపుతాడో, అల్లాహ్ విధించిన హద్దుల్ని అతిక్రమిస్తాడో, అతణ్ణి అల్లాహ్ అగ్నిలో పడ వేస్తాడు. అందులో అతను సదా ఉంటాడు. అతనికి తీవ్ర అవమానంతో కూడుకున్న శిక్ష పడుతుంది."
>
> [అన్ నిసా – 13, 14]

ఖుర్ఆన్ ఇచ్చిన ఈ వారసత్వపు ఆదేశాలను సక్రమంగా అనుసరిస్తే పరలోకపు శాశ్వత సాఫల్యం లభిస్తుందని, వాటిని అతిక్రమిస్తే శాశ్వత నిష్ఫలత ప్రాప్తిస్తుందన్న సంగతి పై దైవోప దేశం ద్వారా స్పష్టంగా బహిర్గతమవుతూనే ఉంది.

ఇదే విధంగా విడాకులకు సంబంధించిన కొన్ని ఆజ్ఞలు ఇచ్చిన తరువాత ఇలా అనబడింది :

---

నిర్ణయించడం అంటే అర్థమేమిటి? ఆ ఆదేశం ఖుర్ఆన్‌లోనిదే అయినప్పటికీ అది ధర్మానికీ, విశ్వాసానికీ సంబంధించింది కాదని భావించినప్పుడే అలా చెప్పడం సాధ్యమవుతుంది. ముఖ్యంగా దాన్ని పవిత్రమయిందిగా దానితో వాదించడంగాని, విభేదించడం గాని తగని దైవ గ్రంథమని ఒప్పుకున్నప్పుడు ఈ భావం మరింతగా బలపడుతుంది.

"మీరు నిజంగా అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని విశ్వసించినవారే అయితే, అలా ఎంత మాత్రం చెయ్యకూడదని మీకు బోధించబడుతోంది." [అల్ బఖర - 232]

ఒక వ్యక్తి విశ్వాసి అవడానికీ అతను ఈ ఆదేశాలను నిర్వర్తించటానికీ ఖుర్ఆన్ దృష్టిలో అవినాభావ సంబంధం ఉందని తెలుస్తోంది. ఒక వ్యక్తి మనస్ఫూర్తిగా ముస్లిమ్ అయి ఉండి ఈ ఆజ్ఞలను త్రోసిరాజనడం అనేది అసంభవం.

ముజాదిలా సూరాలో 'జిహార్'* గురించిన ఆదేశాలు ఇవ్వబడిన తరువాత, దాని ప్రాముఖ్యతను ఎలా నొక్కిచెప్పటం జరిగిందో చూడండి :

"(ఈ ఆదేశాలు ఎందుకు ఇవ్వబడినాయంటే) వీటి ద్వారా మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను విశ్వసించేవారుగా అవుతారని. ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు. వీటిని ధిక్కరించేవారికి వ్యథాభరితమయిన శిక్ష ఉంటుంది."

[ముజాదిల : 4]

'ధిక్కరించేవారికి వ్యథాభరితమయిన శిక్ష ఉంటుంది' అనే

---

* 'జిహార్' (Zihar) అంటే ఆగ్రహావేశంలో భర్త భార్యతో, 'నిన్ను ముట్టను పో' అని ప్రకటించటం లేక భార్యను హరామ్ (నిషిద్ధం) అయిన బంధుత్వంగల స్త్రీగా చెప్పడం, ప్రకటించడం అని అర్థం. అలా చేసినవారు, తమ ఈ తొందరపాటు చేష్టకి పరిహారంగా ఒక బానిసను స్వతంత్రుణ్ని చేయడంగానీ, లేక 60 రోజులు ఉపవాసం పాటించడంగానీ, లేక 60 మంది నిరుపేదలకు ఒక రోజు అన్నం పెట్టడంగానీ చేయనంతవరకు తమ భార్యతో సమాగమం చేయరాదన్నది దైవాజ్ఞ.

వాక్యం ఈ సందర్భంలో రావడాన్ని బట్టి, పైన ప్రస్తావించబడిన జిహాద్ ఆజ్ఞల్ని తోసిపుచ్చిన తరువాత ఏ వ్యక్తీ విశ్వాస పరిధిలో ఉండలేడన్నది ఖుర్ఆన్ ఉద్దేశ్యం అని తేటతెల్లమయిపోయింది.

## ధర్మంలో భాగమనడానికి స్పష్టమైన తార్కాణం

ఇస్లామ్ వ్యక్తిగత చట్టాలను గురించి ఖుర్ఆన్ వివరించిన ఈ నాలుగు యదార్థాలను— అవి నిజానికి ఒకదానితో మరొకటి పెనవేసుకుని ఉన్న యదార్థాలు, వాటిలో ఏ ఒక్కటి అల్లాహ్, ఆయన ప్రవక్త ప్రవచనంలో ఉన్నా, మిగిలిన మూడు కూడా ఉండటం అనివార్యం— ముందుంచుకుని ఈ చట్టాలు ఇస్లామ్ ధర్మంలో భాగం అవునో కాదో మీరే నిర్ణయించండి. ఈ ప్రశ్నకు 'కాదు' అని సమాధానమివ్వడం అటు బుద్ధికీ సాధ్య పడదు, ఇటు శాస్త్రీయ నిజాయితీకీ సంభవం కాదని నిశ్చయంగా చెప్పవచ్చు. ఒకవేళ అలా చేస్తే అది కళ్ళారా చూసినదాన్నే లేదన్నట్లు అవుతుంది. ఇటువంటి స్పష్టమయిన సాక్ష్యాలుండగా బుద్ధిగల ప్రతి వ్యక్తీ ఈ చట్టాలు ఖుర్ఆన్, హదీసుల్లో అంత ర్భాగమని, ఖుర్ఆన్‌లోని మరే భాగమయినా ఎంత ముఖ్య మయిందో అంతే ముఖ్యమయిన భాగమని ఒప్పుకుని తీర్తాడు. ఈ ఆదేశాలు దీన్ మరియు షరీఅత్‌లోని ఓ భాగమే అని, దాన్ని ఎప్పటికీ వాటి నుండి వేరుచేయటానికి వీల్లేదని, అది లేకుండా ఇస్లామీయ ధర్మానికి ఓ రూపమే రాదని అంగీకరిస్తాడు.

ఇక ఏ ఆదేశాలు, ఏ నియమాలయితే దైవ వచనంలో స్పష్టంగా ప్రస్తావించబడ్డాయో, ఏ ఆదేశాలయితే మరింత వివ

రంగా మహాప్రవక్త ప్రబోధనల్లోనూ లభిస్తాయో. వేటినయితే దివ్య ఖుర్ఆన్ 'అల్లాహ్ హద్దులు' అని నిర్ధారించిందో, వేటినైతే అల్లాహ్ తరఫున మోపబడిన విధులు అని, ఆదేశాలని చెప్పడం జరిగిందో, మరింకా ఖుర్ఆన్ ఇచ్చిన ఏ ఆదేశాలయితే కేవలం ఆదేశాలు మాత్రమేగాక వాటిలో కుర్ఆన్ మౌలిక సూత్రాలు, ఆశయాలు, నైతిక విలువలు నిబిడీకృతమై ఉన్నవో, ఇంకా వేటి అవలంబననయితే విశ్వాసానికి, తప్పనిసరయినదిగా, మోక్షానికి మూలాధారంగా పేర్కొనడం జరిగిందో— అటువంటి ఆదేశాలు, నిర్దేశాలను కూడా అవి ధర్మంలో భాగం కాదు పొమ్మంటే, ఇక ధర్మమంటే ఇస్లామ్ అంటే అర్థమే ఏముంది? ఆఁ ఎవరయినా అసలు ఈ రకమయిన చట్టాలు దీన్ మరియు షరీఅత్‌లో భాగమే కాకూడదని, మానవ నాగరికత మరియు సామాజిక జీవితంలో ఖుర్ఆన్ సున్నత్‌లకు పొత్తు ఉంచాల్సిందేకాదు అనే ప్రశ్నను లేవనెత్తితే అది వేరే విషయం. అటువంటి వ్యక్తి ఇంకా ముందుకుపోయి అసలీ ఖుర్ఆన్ సున్నత్‌లే అసాంతం స్వీకార యోగ్యం కానివి అని చెప్పినా చెప్పివేయవచ్చు. ఆ వ్యక్తి ధర్మాన్ని త్రోసిరాజన్నాడని అనుకొని సరిపెట్టుకోవచ్చు. అయితే ఫలానా ఆదేశాలు ఖుర్ఆన్‌లో ఉన్న విషయం నిజమే, వాటిని ఆచరించటం తప్పనిసరిగా పేర్కొన్న సంగతీ నిజమే. వాటిని విశ్వాసానికి, మోక్షానికి మూలాధారాలుగా ఖరారు చేసిన మాటా వాస్తవమే అయినప్పటికీ ధార్మికంగా వాటికి ఎలాంటి ప్రాముఖ్యత లేదు అని బుకాయించే హక్కు మాత్రం అతనికి లేదు. ఇది ఒకే సమయంలో పగలు ఉందని ఒప్పుకుంటూనే సూర్యుడు లేడు పొమ్మనే వితండవాదంలాంటిదే.

# 'ముస్లిం' కాదు 'ఇస్లామిక్' లా

ముస్లిమ్ పర్సనల్ లా అనబడే ఈ ఆదేశాలు వాస్తవానికి ధర్మంలోని ఒక భాగమేననీ, ఇతర జాతులు స్వయాన నిర్మించుకున్న తమ వ్యక్తిగత చట్టాలకు ఇవి పూర్తిగా భిన్నమయినవన్న యదార్థం నిరూపితం అయిన తరువాత కూడా వీటిని 'ముస్లిమ్ పర్సనల్ లా' అనే అనడం వాస్తవం యొక్క తప్పుడు నిర్వచనం కాకపోయినా అసంబద్ధమయిందనడంలో మటుకు సందేహం లేదు. ఇవి 'ముస్లిమ్' చట్టాలు కావు, ఇస్లామిక్ చట్టాలు అన్న సంగతిని మీరు వెనుకటి పంక్తుల ద్వారా తెలుసుకున్నారు. అవి ముస్లిమ్‌ల మేధ నుండి పుట్టినవి కావు. వారి బుద్ధివివేకాల, ఇష్టాయిష్టాల ప్రమేయం వాటిలో ఏ మాత్రం లేదు. వాటి ఆవిర్భావానికి మూలం ఖుర్ఆన్ సున్నత్‌లే. కనుక వాటిని 'ముస్లిమ్ పర్సనల్ లా' అనే పేరుతో స్మరించడం అంటే బుద్ధిపూర్వకంగానో, లేక యాదృచ్ఛికంగానో వాటి నిజస్థాయిపై ముసుగు వేయడమే అవుతుంది. వాటికివ్వబడిన ఈ పేరు కూడా వాస్తవానికి ఆంగ్లేయుల హయాంనాటి అశుభమయిన 'కానుకే' ఆ కాలంలో ముస్లిముల సంస్కృతిని, వారి ధర్మాన్ని గాయపరచడానికి, ధార్మిక భావనను రూపుమాపడానికి నిరంతర ప్రయత్నాలు జరుగుతుండేవి. ఈ ఇస్లామ్ వ్యతిరేక లేక ఇస్లామ్ పట్ల అవగాహనాశూన్యమయిన ఆలోచనా తీరు మూలంగానే ఖుర్ఆన్ మరియు ఇస్లామ్ ఆదేశాలను 'ఖురానిక్ లా' అని, 'ఇస్లామిక్ లా' అని అనటానికి బదులు 'ముహమ్మడెన్ లా' అని నిర్వచించడం జరిగింది. న్యాయశాస్త్ర గ్రంథాలలో, న్యాయస్థానాలలో అది రివాజు అయిపోయింది. ఆ పదం అందరి

నోటిలో నానేలా చేయడం జరిగింది. అది నిజమయిందిగా. వాస్తవానికనుగుణంగా ఉండటంలో ఎలాంటి సందేహమే లేనంతగా ప్రచారం జరిగింది. మరి ఆ తరువాత దాని పర్యవసానంగానే ముస్లిముల వ్యక్తిగత జీవితంతో ముడిపడి ఉన్న షరీఅత్ ఆదేశాలను 'ముస్లిమ్ పర్సనల్ లా' అని నామకరణం చేయడం జరిగింది. నిజానికి అది 'ముస్లిమ్ లా' కాదు, 'ఇస్లామిక్ లా.' అందుచేత నిజాయితీ యదార్థ ప్రియత్వం కోరేదేమంటే ఈ ఆదేశాలను వాటి అసలయిన పేరుతోనే గుర్తించాలి. ఇది కేవలం యథార్థ ప్రియత్వమే కాదు, నేటి అవశ్యకత కూడా.

నేడు ఇస్లామ్ గురించిన అవగాహనారాహిత్యం ఎంత అధికమయిందంటే విద్యావంతులనబడేవారు సయితం 'ఇస్లామ్' మరియు 'ముస్లిమ్'ల మధ్య తేడాను గమనించలేకపోతున్నారు. ఈ పరిస్థితులలో 'ముస్లిమ్ పర్సనల్ లా' అనే ప్రయోగం ఇలాగే కొనసాగితే సహజ పరిణామంగా, కొంత కాలం తరువాత షరీఅత్ ఆదేశాల నిజ స్వరూపమే సామాన్య జనానికి కనబడకుండా పోతుంది ఇదయితే ముస్లిమ్ పర్సనల్ లా మాత్రమేనని, దీనికి ఇస్లామ్‌తో ఎట్టి సంబంధం లేదని, దీని సంబంధమంతా కేవలం ముస్లిములతోనే ఉందని, ప్రపంచంలోని ఎన్నో జాతుల వ్యక్తిగత చట్టాలు ఏ విధంగానయితే ఆయా జాతులు మతాన్ని వదలిపెట్టి కేవలం నాగరికత ఆధారంగా సంకలనం చెయ్యబడ్డాయో అదే విధంగా ముస్లిములనబడే ఒక జాతి నాగరిక అవసరాలకు కల్పించబడ్డ చట్టాలే ఇవి అని ప్రజలు తలపోసేందుకు ఆస్కారముంది. చెప్పండి! ఇంత పెద్ద మౌలిక

మయిన అపార్థాన్ని అలాగే మిగల్చడం. దాన్ని పెంచి పోషిస్తూ ఉండటం న్యాయమా ? సమంజసమా ?

## ధర్మంలో భాగం అవడానికి కారణం

ముందుకు సాగముందు కాస్త ఆగి, ఇస్లామీయ శిక్షణల పరిధి కుటుంబ, సామాజిక విషయాల వరకు విస్తరించడానికి కారణమేమిటో కూడా అర్థం చేసుకోవడం సబబు. ఆ మూల కారణం, ఖుర్ఆన్ ప్రతిపాదించే అల్లాహ్, దీన్ (ధర్మం), ఇబాదత్ (ఆరాధన) అనే విషయాలకు సంబంధించిన మౌలిక భావనలలో కానవస్తుంది. ఈ భావన కాక మరే భావననయినా ఈ విషయాలకు ఆపాదించినట్లయితే అది ఖుర్ఆన్ దృష్టిలో అసంపూర్ణం. దోషభూయిష్ఠం, అజ్ఞానభరితంగానే పరిగణించ బడుతుంది. ఆ మౌలిక భావనల వివరణ క్లుప్తంగా ఇది :

దేవుడు యావత్తు విశ్వ వ్యవస్థకు సృష్టికర్త. ఆయన సమస్త జీవరాసులకు పోషణకర్త ప్రభుత, న్యాయం, వివేచన, కారుణ్యం, శక్తి, ఆధిపత్యం, సర్వజ్ఞత— ఇత్యాది ఉత్తమ గుణ గణాలన్నీ ఇతోధిక పరిపూర్ణతతో ఆయనకే సొంతం. ఆయన ఏ విధంగా సర్వ సృష్టికి కర్తయో, పోషణ కర్తయో అదే విధంగా ఆయన దాని సంచాలకుడు, నిర్వాహకుడూను. యజమాని, స్వామి కూడా. సర్వాధికారి, శాసన నిర్మాత, శాసనప్రదాత, ఆరాధ్యుడు, పూజనీయుడు కూడాను. మరే ఇతరుడూ ఆయన లోని ఈ గుణగణాలలో, ఈ హోదాలలో, ఆయన అధికారా లలో, హక్కులలో ఇసుమంత కూడా భాగస్వామ్యం కలిగిలేడు.

అందుకే ఉపాసనకూ, విధేయతకు ఆయనే అర్హుడు— నిర్నిబంధ మయిన విధేయతకు— అర్హుడు కూడా ఆయనే.

మనిషికి రుజుమార్గం చూపడానికి, సత్యబాటపై అతన్ని నడిపించి నిజసాఫల్య గమ్యం వరకు చేర్చడానికిగాను దైవం అనుగ్రహించిన మార్గదర్శకత్వం, అంటే ఆదేశాలు చట్టాల సముదాయమే దీన్ (ధర్మం). దేవుడు న్యాయశీలుడు, వివేచనా పరుడు, పరిపోషకుడు, పరిపాలనాధికారి, సార్వభౌముడు అయిన కారణంగా ఇది ఆయన బాధ్యత మనిషి భౌతికావసరాల కోసం అన్నపానీయాలను సమకూర్చినట్లే అతని ఆధ్యాత్మిక నైతిక అవస రాల కోసం సాధనాసంపత్తిని సమకూర్చవలసిన భారం కూడా ఆయనపై ఉండింది. లేకపోతే ఆయన పోషణ కర్తృత్వం అసంపూర్ణమవుతుంది, ఆయన న్యాయశీలత విఫలమైపోతుంది, ఆయన వివేచన నిస్సారం అనిపించుకుంటుంది. ఆయన సార్వభౌమాధికారం అర్థంలేనిదనిపించుకుంటుంది. మరో మాటలో చెప్పాలంటే అట్టి పరిస్థితుల్లో దేవుడు దేవుడని పిలి పించుకోడానికే అర్హుడు కాడు.

మరోవైపు మనిషికి అతని జీవిత పరమార్థమేమిటో, ఆ పరమార్థ సిద్ధికై మార్గం ఏమిటో తెలుపవలసిన అవసరం కూడా ఉండింది. అతనికి తన ప్రభువు అభీష్టం ఏమిటో, తన నిజ పాలకుని ఆదేశాలేమిటో ఎరుకపరచవలసి ఉండింది. ఈ జ్ఞానం మార్గదర్శకత్వంలోనే అతడు తన కోసం ఆలోచన ఆచ రణల రుజుమార్గాన్ని పొందగలుగుతాడు, ఊహాకల్పనల చీకట్లలో తచ్చాడకుండా ఉండగలుగుతాడు. ఇదీ దీన్(ధర్మం) ఉద్దేశ్యం, ఆశయం కావడంచేత, అది మనిషి మొత్తం నైతిక

జీవనానికే అవశ్యమయింది. అది దేవుని పోషణ, పాలనా గుణాల పర్యవసానం కావడం వల్ల అది మనిషి జీవన వ్యవస్థకు సంబంధించిన అన్ని రంగాలను పరివేష్టించింది. ఏ విభాగం, మరే రంగం కూడా దాని పరిధికి పూర్తిగా అవలలేదు. ఎందుకంటే మనిషి జీవితపు ఏ వ్యవహారం కూడా నైతిక కోణం, మంచీ చెడుల చర్చ తలెత్తకుండా కానరాదు అందుచేత ధర్మం, అంటే దైవ మార్గదర్శకత్వం కూడా ఏ వ్యవహారాన్ని ఉపేక్షించకుండా ఉండడం, మరే జీవన విభాగమూ దాని మార్గదర్శకత్వం లేకుండా ఉండడం అత్యవసరమయింది. ఈ కారణంగానే దేవుని ఈ అంతిమ ధర్మం— ఇస్లామ్— ఒక్కొక్కటి చొప్పున జీవితపు సమస్యలన్నింటినీ చర్చిస్తోంది. ఆరాధనాలయం నుండి సామూహిక జీవితపు అఖరి అంచు వరకు అన్ని విషయాలకు సంబంధించిన నిర్దేశాలనూ ఇస్తుంది. ఈ సమస్త ఆదేశాల సముదాయానికే దీన్ (ధర్మం) అని పేరు. ఈ సముదాయం లోని ప్రతి ఒక్క అంశమూ సమంగా ధర్మంలోని అంతర్భాగమే.

ఇస్లామ్‌లో ఆరాధన అంటే అర్థం కేవలం పూజాపురస్కారాలే కాదు— అది అంతకన్నా విస్తృతమయింది. దైవోపాసన, దైవ సంస్మరణ అనేవి నిస్సందేహంగా ఆరాధనకు ఊపిరే. అయితే అవీ సంపూర్ణ ఆరాధన కావు. మరి సంపూర్ణ ఆరాధన అంటే ఏమిటి? దైవం పంపిన ధర్మాన్ని పూర్తిగా అవలంబించటం, ఎటువంటి భేదం, విభజన పాటించకుండా చిత్తశుద్ధితో, సంకల్ప నిరతితో, మనస్ఫూర్తిగా వినయ వినమ్రతలతో దైవధర్మాన్ని పాటించడం అన్నమాట. ఇంతకుముందు తెలుపబడినట్లు దైవం పంపిన ఈ ధర్మం ఓ సమగ్ర మార్గదర్శకత్వం కావటం

మూలంగా, ఇంకా అది మొత్తం మానవ జీవితాన్ని విస్తరించి ఉండటం మూలంగా, ఆ మార్గదర్శకత్వంలోని ఒక్కో అక్షరాన్ని గట్టిగా పట్టుకోనంత వరకు, యావజ్జీవితాన్ని దానికి అప్పజెప్పనంత వరకు దైవారాధన ఏ మాత్రం నెరవేరదు.

ఇవీ, ఖుర్‌ఆన్ మరియు ఇస్లామ్ దృష్టిలో దైవం, దైవ ధర్మం, ఆరాధనలకు సంబంధించిన సరయిన భావనలు. అలాంటప్పుడు, మనిషి వ్యక్తిగత జీవితంతో ముడిపడి ఉన్న వ్యవహారాలతో వాటికి సంబంధమే లేకపోవడమనేది ఎలా సంభవం? ఒకవేళ ఉన్నా అది ధర్మం, ఆరాధన, దైవభక్తులతో అవినాభావ సంబంధమున్న అంశం కాకపోవడం అనేది ఎలా సాధ్యం? కుటుంబ, సామాజిక వ్యవహారాలు కూడా ఈ మానవ జీవితంలోని అంతర్భాగమేగా ; అంతేకాదు, అవి అత్యంత ముఖ్యమైన, అన్ని పరిస్థితుల్లోనూ అనివార్యమైన అంతర్భాగమే. మరి అటువంటప్పుడు వాటిని దైవధర్మం ఎలా విస్మరించివదిలివేయగలదు? వాటి విషయంలో మార్గదర్శకత్వం ఇవ్వకుండా ఎలా ఊరుకోగలదు? సత్యం, న్యాయం, రుజువర్తనలు కోరేదేమిటో తెలుపకుండా ఉండగలదు? లేక ఈ విషయాల్లో అది (దైవధర్మం) ఇచ్చిన ఆదేశాలకు ఎలాంటి ధార్మిక ప్రాధాన్యత లేకుండా పోతుంది? వాటికి కట్టుబడి ఉండవలసిన అవసరం లేకుండా ఎలా వీలవుతుంది? విశ్వాసి లేక ముస్లిమ్ అనేవారిపై వాటిని అనుసరించటమో లేక అనుసరించకపోవటమో ప్రభావం వేయకుండా ఎలా ఉంటుంది?

ఎవరి దృష్టిలోనయితే దైవం, ధర్మం, ఆరాధనలకు సంబంధించిన భావనలు వేరయినవో— నిస్సందేహంగా ఇలాంటివారే

అధిక సంఖ్యలో ఉన్నారు— అటువంటివారికి ఇస్లామ్ వ్యక్తిగత చట్టాల ధార్మిక స్థితిని అర్థం చేసుకోవడం, దాన్ని సముచితమయినదిగా, సమంజసమయినదిగా ఒప్పుకోవడమన్నది చాలా కష్టం. అయితే ఇక్కడ జరుగుతున్న చర్చ ఉచితానుచితాలను గురించి ఏ మాత్రం కాదు. ఇది వాస్తవం అవునా కాదా అన్న విషయం గురించి. వాస్తవం మటుకు స్పష్టంగా ఒక్కటే— అయితే ఈ శాసనాలు ధార్మిక (దీన్ని ఎవరూ కాదనలేరు) ప్రతిపత్తిని కలిగి ఉన్నాయని, అవి ధర్మంలోని ఓ భాగమని, ఇలా ఉండటం ఖుర్ఆన్ తెలిపే ధార్మిక భావన, దైవ భావనల దృష్ట్యా ఎంతైనా అవసరమని చెప్పడమే వాస్తవం.

## ముస్లిం సమాజం, సంస్కృతుల రీత్యా ...

ముస్లిముల వ్యక్తిగత చట్టాల నిజస్థితి ఏమిటో, వాటి మౌలిక ప్రాధాన్యత ఏమిటో పై చర్చ ద్వారా సుస్పష్టమయ్యింది. ఈ విషయంలో ఇంకా ఇతరత్రా చర్చించవలసిన అవసరంలేదు. అయితే పరిస్థితుల దృష్ట్యా ఈ చట్టాల నిర్ధారిత స్థితిని అంటే ధార్మిక స్థితిని మాత్రమేగాక సాంస్కృతికంగా, ముస్లిం సమాజం పరంగా కూడా దాని విలువను తెలుసుకోవలసిన అవసరమెంతైనా ఉంది. తద్వారా ఎవరయితే ఏదో ఒక కారణంచేత ఈ చట్టాల ధార్మిక స్థితిని అర్థంచేసుకోలేకపోతున్నారో వారు సయితం, ముస్లిములు తమ పర్సనల్ లా ను ప్రాణప్రదంగా రక్షించుకుంటున్నారంటే నిజంగా వారలా చెయ్యడం ఎంత అవసరమో అన్న సంగతిని తెలుసుకోగలుగుతారు.

ఒకవేళ ముస్లిముల సామాజిక, సాంస్కృతిక ప్రయోజనాలను గనక దృష్టిలో ఉంచుకుని ముస్లిమ్ వ్యక్తిగత చట్టాలను పరిశీలించినట్లయితే వాటి ప్రాముఖ్యతకు సంబంధించిన క్రింద పేర్కొన్న పలు కోణాలు ముందుకు వస్తాయి.

## పర్సనల్ లా మిల్లత్ వ్యక్తిత్వానికి ప్రతిరూపం

మొదటి విషయం ఏమంటే, ఒక సజీవ శరీరానికి దాని నాడీ మండలం ఎంతగా అవసరమో, ముస్లిమ్ వ్యక్తిగత చట్టాలు ముస్లిముల సామాజిక వ్యక్తిత్వానికి, ప్రత్యేకతకు అంతే అవసరం. ఈ వాదనలోని సత్యాన్ని గ్రహించడానికి సమాజాలు సాంస్కృతిక వర్గాల ఉనికి వాటి నిర్మాణం గురించి వివరంగా యోచించండి. ఏ వ్యక్తుల సమూహాన్నయినా ఇతర వ్యక్తులు, ఇతర వర్గాల నుండి వేరుపరచి, వారిని ఓ విలక్షణమయిన వ్యక్తిత్వం గల వర్గంగా, ఓ ప్రత్యేక సమాజంగా తయారుచేసే విశేష అంశాలేవో కాస్త ఆలోచించండి. ఈ ఆలోచన, అనుశీలనల ద్వారా మీకు ఒక విషయం తెలిసివస్తుంది. ఈ వ్యవహారంలో మొట్టమొదటి ప్రాముఖ్యత మౌలిక విశ్వాసాలు భావనలకు ఉన్నప్పటికీ, ఇంకా అవే మిల్లత్ (సమాజం) వ్యక్తిత్వానికి వాస్తవ పెన్నిధి అయినప్పటికీ, మిల్లత్‌లోని వ్యక్తులు మనుగడ సాగించడానికి ఆధారభూతమయ్యే, నిర్దేశాలు, నియమాలు, జీవన రీతులు, ఆచారాల పాత్ర కూడా ఇందులో ఏ మాత్రం తక్కువ కాదు. ఎందువల్లనంటే ఈ విశ్వాసాలు, ఆలోచనలు కళ్ళకు కనిపించే పదార్థాలు కావు— మిల్లత్ వ్యక్తిత్వాన్ని వ్యక్తం చేసే, ప్రత్యేకతను ప్రస్ఫుటం చేసే సంకేతాలుగా

రూపొందటానికి! క్రియాత్మకంగా మిల్లత్ లేక సమాజం ప్రత్యే కతలకు ఆనవాళ్ళుగా, బాహ్యంలో కనిపించే దాని పద్ధతులు, నియమాలు మాత్రమే అలరారుతాయి, అలరారగలవు కూడా. ఆ మిల్లత్ లేక సమాజం వాటిని తన విశ్వాసాలు, బాహ్యాలు, సిద్ధాంతాల కనుగుణంగానే స్వీకరిస్తుంది. వాటి కనుగుణంగానే దాని జీవితానికి సంబంధించిన సమస్త వ్యవహారాలు సాగుతూ ఉంటాయి. ఇంకా ఈ చట్టాలు, నియమాలకు చెందిన భిన్న విభాగాలు జాతి క్రియాత్మక అవసరాలతో, దాని సాధారణ జీవితంతో ఆచరణాత్మక సంబంధం దృష్ట్యా సమానం కాజాలవు. అందుచేత దాని (అంటే ఆ జాతి లేక సమాజం) వ్యక్తిత్వ రూప కల్పనలోనూ వాటి ప్రమేయం సమానంగా ఉండకపోవచ్చు.

సమాజంలోని వ్యక్తుల జీవితంతో ఏ చట్టాలు ఎంత ఎక్కువ సంబంధం కలిగి ఉంటాయో అవి ఆ సమాజ నిర్మాణం లోనూ అంతే ఎక్కువ ప్రమేయం కలిగి ఉంటాయి. ఈ కోణంలో చూసినపుడు వ్యక్తిగత చట్టాలకు ఉన్న స్థానం ఎంత విశిష్టమయిందో ప్రతి వ్యక్తికీ తెలిసిన విషయమే. శిశువుకు పాలు పట్టడం, పిల్లల పెంపకం, హిజానత్, కుటుంబ పోషణ, నికాహ్ (వివాహం), మహర్, మనోవర్తి, దాంపత్య హక్కులూ బాధ్యతలు, తలాక్, ఖులా, ఫిస్కె నికాహ్ (మూడూ విడాకుల రూపాలు), వారసత్వం, వీలునామా మొదలగునవి ఎటువంటి సమస్యలు, వ్యవహారాలంటే వాటి క్రియాత్మక సంబంధం ప్రజ లందరితోనూ ఉంటుంది. దాదాపు ప్రతి వ్యక్తి జీవితం చుట్టూ అవి పరివేష్ఠించి ఉంటాయి. కాగా వ్యక్తి యొక్క ఇతర జీవిత సమస్యల క్రియాత్మక సంబంధంపై వాటిని పోల్చి చూస్తే

పరిమిత వ్యక్తుల వరకు, పరిమిత పరిమాణంలో ఉంటుంది. అందుచేత జీవన వ్యవహారాలను క్రమబద్ధం చేసే పైన ప్రస్తావించిన చట్టాల సామాజిక ప్రాధాన్యత కూడా ఎంతో అధికంగా ప్రస్ఫుటంగా ఉండటమనేది సహజమయిన విషయం. ఇంకా మిల్లత్ వ్యక్తిత్వం, ప్రత్యేకత ఈ చట్టాలపై ఆధారపడినంతగా ఇతర చట్టాలపై ఏ మాత్రం ఆధారపడి ఉండదు. సాధారణ పరిస్థితుల్లో అసలు ఈ చట్టాలు మాత్రమే మిల్లత్ వ్యక్తిత్వానికయినా, దాని ప్రత్యేక ప్రతిపత్తికయినా ప్రతిబింబిస్తాయి అని చెప్పితే తప్పుకాదు. ఈ ఒక్క రూపమే ఈ ప్రత్యేకతలకు ఆశ్రయమిచ్చేది. దీని ద్వారానే వీటిని గుర్తించడం జరుగుతుంది. ఇదే అసలు దాని ఉనికికి, మనుగడలకు ఆయుఃపట్టు వంటిది.

## ముస్లిమ్ సమాజం ప్రత్యేకతల పరిరక్షణ

మరో విషయమేమంటే ఈ వ్యక్తిగత చట్టాలు వాస్తవానికి ముస్లిమ్ సమాజం ప్రత్యేకతల్ని సయితం పరిరక్షిస్తున్నాయి. సమాజాల ఉత్థాన పతనాల గురించి నిశితంగా పరిశీలిస్తే ప్రతి సమాజంలోని నమ్మకాలు, ఆలోచనా విధానం, ఆచార నియమాల మనుగడ దాని వ్యక్తిగత చట్టాలతో ముడివడి ఉంటుంది. వాటి ఆధారంగానే ఆ సమాజ నిర్మాణమవుతుంది. ఈ చట్టాలు ఆ సమాజానికి మూలం కాకపోయినప్పటికీ అనివార్యంగా అవి ఆధారాలుగా అలరారుతాయి.

వ్యక్తిగత చట్టాలకు సమాజానికి గల సామ్యం ఓ వృక్షం లాంటిది. దాని వేళ్ళ నుండే పుట్టిన కొమ్మలు, రెమ్మలు,

ఆకులు పచ్చగా కళకళలాడుతూ ఉండాలంటే, వాటికి అవసరః
మయిన ఆహారాన్ని వ్రేళ్ళే అందజేస్తాయి. కాని ఆ వ్రేళ్ళు,
కూడా తమ జీవనానికి కొమ్మలపై, ఆకులపై ఆధారపడతాయి.
వ్రేళ్ళు కనుక ఎండిపోతే ఆకులు, కొమ్మలు తమ జీవాన్ని
కోల్పోతాయి. అలాగే ఆకులు, కొమ్మలు, రెమ్మలు కోల్పోయిన
చెట్టు వ్రేళ్ళు సయితం ఎండిపోయి కృశించిపోతాయి. అదే
విధంగా సమాజాలలోని మౌలిక ఆలోచనలు, భావాలు, నమ్మ
కాలు, వాటి ఆచరణాత్మక స్వరూపాలు జీవితంలో సక్రమంగా
అమలులోకి వచ్చినంత కాలం, ఆ సమాజపు ఆలోచనల్లో,
భావాల్లో జీవం, శక్తి కానవస్తాయి. ఈ క్రియాత్మక రూపాలు
జీవన రంగం నుండి మాయమవగానే భావాలు, నమ్మకాలు
కూడా బలహీనమయి క్రమేణ నిర్జీవమయిపోతాయి. ఒక జాతి
జీవితంలో ఆచరించే సకల నియమాల ద్వారా దాని మౌలిక
భావనలు వ్యక్తమయినా నిజానికి వ్యక్తిగత చట్టాల ఆచరణాత్మక
ప్రాముఖ్యం అన్నింటినీ మించినదై ఉంటుంది. అందువల్ల
వ్యక్తిగత చట్టాలను అమలుపరచడం లేక పరచకపోవడం అన్న
దాని ప్రభావం ఆ జాతి మౌలిక నమ్మకాలపై స్పష్టంగా కాన
వస్తుంది.

ఈ వ్యక్తిగత చట్టాలపై దృఢంగా నిలిచి ఉన్న పక్షంలో
సమాజపు నమ్మకాలు, ఆలోచనలతో దాని సంబంధాలు పటిష్ఠ
మవుతాయి. ఆచరణా బంధాలు తెగిపోతే మూలాలతో ఆ
సమాజ సంబంధాలు బలహీనపడి క్రమేణ సమసిపోతాయి.
ఎందుకంటే వ్యక్తిగత చట్టాలను తృణీకరించడమంటే, ఆ చట్టాలు
ఇక ఆ జాతి దృష్టిలో అసమంజసమయినవని, స్వీకారయోగ్యం

కావని నిర్ణయించుకోవటమన్న మాట. సమాజపు మౌలిక ఆలోచనలూ, భావనల ఆధారంగా జన్మనెత్తిన వ్యక్తిగత చట్టాలను కాదనడమంటే, దాని మౌలిక ఆలోచనల, నమ్మకాల సామంజస్యాన్నే ప్రశ్నించడమన్నమాట. తన మూలాల పట్ల దాని ఈ విశ్వాసరాహిత్యాన్ని ఆ జాతి స్వయంగా గుర్తించక పోవడం అన్నది వేరే విషయం.

ఈ మానసిక పరివర్తన అక్కడే ఆగిపోదు. ఇంకా ముందుకుపోతుంది. సమాజం తన మౌలిక విశ్వాసాలను, ఆలోచనా విధానాన్ని వదులుకోవడంతో ఆగక ఇతర ఆలోచనా విధానాలు, విశ్వాసాలతో ప్రభావితం అవుతుంది. ఎందుకంటే ఆచరణాత్మకంగా తన వ్యక్తిగత చట్టాలతో సంబంధాన్ని తెంచుకున్న సమాజం వాటి స్థానే వేరే చట్టాలను అనుసరించక తప్పదు. ఆ ఇతర చట్టాలు, ఇతర సమాజాల ఆ సిద్ధాంతాలు, విశ్వాసాలపై ఆధారపడి ఉంటాయి. ఆ చట్టాలను సమాజంలో అమలు పరచడం వల్ల ఆయా ఇతర సమాజాల ఆలోచనలు, నమ్మకాల పట్ల ఆకర్షణ పెరుగుతుంది. తన వ్యక్తిగత చట్టాలను వదులుకున్న సమాజానికి తన వ్యక్తిగత ప్రత్యేకతల పట్ల స్పృహ ఉండదు. అందువల్ల ఇతర సిద్ధాంతాల దాడిని ఎదుర్కోవడం పట్ల అంత ఆసక్తి చూపదు. చివరకు ఆ సమాజం తన మౌలిక విశ్వాసాలు, సిద్ధాంతాల పునాదులు కదిలిపోతాయి. తన విశ్వాసాలు, సిద్ధాంతాలలో మార్పులు చేర్పులు చేయడానికి ఆ సమాజం సిద్ధపడిపోతుంది. అందువల్ల ప్రతి సమాజంలోని పర్సనల్ లా ఆ సమాజపు ప్రత్యేకతను మాత్రమే కాదు, అది దాన్ని పరిరక్షిస్తుంది కూడా.

అనేక జాతుల, సమాజాల చరిత్రలు ఈ వాస్తవాన్నే చాటుతున్నాయి.

## పర్సనల్ లా లేకపోతే సమాజ ప్రత్యేకత నశిస్తుంది

ఇంకో విషయమేమంటే, తన పర్సనల్ లాను కోల్పోయిన తరువాత ఆ సమాజం ప్రత్యేకత కూడా మిగలదు. ఎందుకంటే, జాతి యొక్క ప్రత్యేకతలను ప్రతిబింబించే పర్సనల్ లా ఆ జాతి యొక్క ఉనికిని పరిరక్షించే పర్సనల్ లాను కోల్పోయిన తరువాత ఆ జాతి తన ఉనికిని నిలుపుకోవడం అసాధ్యం. పర్సనల్ లాను కోల్పోవడమంటే ఆ జాతి తన వ్యక్తిత్వాన్ని, ఉనికిని కోల్పోయిందన్న మాట. ఎందుకంటే, ఆ జాతి పర్సనల్ లాను రద్దుచేసి, ఆ జాతి యొక్క ప్రత్యేకతలను చెరిపివేసి, ఆ జాతిని మరో మూసలో పోసి ఆఖరుకు ఈ విధంగా ఆ జాతిని పరకాయ ప్రవేశం గావించిన కారణంగా ఆ జాతి మౌలిక విశ్వాసాలు సయితం కదలిపోయినప్పుడు ఇక ఆ జాతి సజీవంగా ఉండడం సాధ్యమా? ఈ పెను మార్పుల తరువాత మరో జాతి ఛత్ర ఛాయల్లోకి చేరి అందులో లీనమయిపోవడమే ఆ జాతికున్న ఏకైక భవిష్యత్తు. ఆ జాతి లేదు, ఆ సమాజంలోని వ్యక్తులు అస్సలు ఉండరని కాదు అర్థం. వ్యక్తులు ఉంటారు. అంతే కాదు, వ్యక్తిగతంగా వాళ్ళు అభివృద్ధి సాధించి అత్యున్నత స్థాయిని చేరుకొనీ ఉండవచ్చు. కాని జాతి ప్రత్యేకతలు లేని వ్యక్తుల్ని సమాజమనరు. ఇలాంటి లక్షల, కోట్ల మంది వ్యక్తులున్నప్పటికీ 'ఆ జాతి' గతించిన ఓ చారిత్రక గాథలా మారిపోతుంది.

# పర్సనల్ లా రద్దు, ఓ ప్రమాదకరమైన చర్య

జాతులు, సమాజాల పర్సనల్ లాకు ఉన్న అసాధారణ ప్రాముఖ్యత ఇది. ఈ కారణంగానే ఆత్మాభిమానం, ఆత్మ గౌరవం ఏ మాత్రమయినా ఉన్న జాతులు తమ వ్యక్తిగత చట్టాలను ప్రాణప్రదంగా భావిస్తాయి. ఎట్టి పరిస్థితులు ఎదురయినప్పటికి పర్సనల్ లా ను కాపాడుకోవాలనుకుంటాయి. పర్సనల్ లా తో సమాజానికి సైద్ధాంతిక సంబంధం ఎలాగూ ఉంటుంది. దానితోపాటు భావపరమైన, ఉద్విగ్నతతో కూడుకున్న బంధమూ ఉంటుంది. భావపరమైన ప్రగాఢ సంబంధమున్న విషయంలో వ్యక్తులు భావుకులయిపోతారు, వారి భావాలు అతి సున్నితమయి పోతాయి. దాని గౌరవం మంటగలిస్తే వారు భరించలేరు. మరే విషయం కోల్పోయినా సహిస్తారేమోగాని, తాము ఎంతో అభిమానించే అంశాన్ని వదలుకోవడం వారు ఆలోచించనూలేరు. అందువల్లనే చరిత్రలో పెద్ద పెద్ద మహా సామ్రాజ్యాలు తమ అధీనంలోని జాతుల సర్వస్వాన్ని దోచుకోగలిగారుగాని వాళ్ళ వ్యక్తిగత చట్టాల జోలికి పోలేదు. రోమన్ ఎంపైర్, బ్రిటన్ సామ్రాజ్యం అందుకు మంచి ఉదాహరణ. ఆంగ్లేయులు భారత దేశంపై అధిపత్యాన్ని పొందిన తరువాత, అప్పటివరకు అమలులో ఉన్న సాధారణ ఇస్లామీయ చట్టాలను తొలగించి వాటి స్థానే తమ చట్టాలను ప్రవేశపెట్టారు. కాని, ఇక్కడి పౌరుల పర్సనల్ లా కు సంబంధించినంతవరకు వాటిని ముట్టుకోలేదు. అందుక్కారణం ఒక్కటే, ఇక్కడి ముస్లిమ్‌లకు, హిందువులకు తమ తమ వ్యక్తిగత చట్టాల పట్ల అత్యంత అభిమానముండి, ఆ చట్టాల కోసం వాళ్ళు తమ ప్రాణాలనైనా

నవ్వుతూ అర్పిస్తారు. తమ చట్టాలను రద్దు చేయడాన్ని మాత్రం సహించరు. అందువల్ల సున్నితమయిన అంశాన్ని కదపటం ప్రమాదకరం.

నేటి వరకు యదార్థంగా నిరూపితమయిన విషయం ఒక్క సారిగా అవాస్తవికం అయిపోదు. పర్సనల్ లా కు గల ఈ సాంస్కృతిక ప్రాధాన్యత ఇతర జాతులు, సమాజాల మాదిరి గానే ఇస్లామీయ సమాజంలోనూ ఉందన్న విషయాన్ని కాదన లేము. ముస్లిమ్ పర్సనల్ లా ఇస్లామీయ సమాజానికి స్వరూపంగా, దాని సామూహిక వ్యవస్థకు రక్షణ కవచంగా పని చేస్తుంది. ఈ పర్సనల్ లా ను కోల్పోవడం ముస్లిముల సామాజిక ప్రత్యేకతల సర్వనాశనంగా తేలుతుంది. అందువల్ల ముస్లిమ్‌ల పర్సనల్ లా వారి విశ్వాసాలతో ముడివడి ఉండక పోయినా వారికి అది తమ ప్రాణంకన్నా ఏ మాత్రం తక్కువగా ప్రేమపాత్రమై ఉండేది కాదు.

—(o)—

# ముస్లిం పర్సనల్ లా

## యూనిఫాం సివిల్ కోడ్

— షమ్సు పీర్జాద

# ముస్లిమ్ పర్సనల్ లా అంటే ఏమిటి ?

భారత దేశంలో ముస్లిమ్ పర్సనల్ లా చరిత్ర క్లుప్తంగా ఇది : మొగల్ చక్రవర్తుల హయాంలో ఇస్లామ్ చట్టం రాజ్య శాసనం (Law of the Land)గా ఉండేది. అంటే సివిల్ చట్టమే గాక, క్రిమినల్ చట్టం (Criminal Law) కూడా ఇస్లామ్ శాసనాల పరిధిలోనే ఉండేది. వీటి ప్రకారమే న్యాయ వ్యవస్థ నడపబడేది. అయితే వివాహాది విషయాలు, వారసత్వం, ఆస్తిపాస్తులు తదితర వ్యవహారాలలో ముస్లిమేతరులకు తమ మత ధర్మాల ప్రకారం, సాంప్రదాయక నియమాల ప్రకారం అనుసరించే సంపూర్ణ స్వేచ్ఛ ఉండేది. అంటే ఒక విధంగా వారి కోసం వారి పర్సనల్ లా ఉండేది. ముస్లిముల కోసం ముస్లిముల పర్సనల్ లా ఉండేది. క్రీ. శ. 1765లో ఈస్టిండియా కంపెనీ

భారత న్యాయస్థానాలను పునర్వ్యవస్థీకరించిన తరువాత న్యాయ వేత్తల సహకారంతో ఇంగ్లీషు న్యాయమూర్తులు ఇస్లామీయ శాసనాల కనుగుణంగా తీర్పులు ఇచ్చేవారు. ఆ పిదప క్రమ క్రమంగా ఇంగ్లీషు చట్టాలు ప్రవేశపెట్టసాగారు. క్రీ. శ. 1862 నాటికల్లా ఇస్లామ్ క్రిమినల్ లా ను పూర్తిగా రూపుమాపి దాని స్థానంలో ఇండియన్ పీనల్ కోడ్ (Indian Penal Code) విధించటం జరిగింది. నేటికీ అది ఆ పేరుతోనే వ్యవహరించబడుతున్నది. దీనిద్వారా ఇస్లామ్ చట్టాన్ని నికాహ్ (పెళ్ళి), తలాక్ (విడాకులు), హిబా (దానం), వారసత్వం మొదలైన కుటుంబ మరియు వ్యక్తిగత వ్యవహారాలకు మాత్రమే పరిమితం చేయటం జరిగింది.* అయితే ముస్లిమేతర సంస్కృతీ ప్రభావం వల్ల ముస్లిములలోని కొన్ని వర్గాలలో ఇస్లామ్ శాసనాల స్థానే సాంప్రదాయక చట్టాలు చోటుచేసుకున్నాయి. ఉదాహరణకు, హైందవ సంస్కృతీ ప్రభావంతో స్త్రీలకు ఆస్తిలో హక్కు ఇవ్వబడేది కాదు. అందుచేత ముస్లిమ్ మేధావుల, సామాన్య ముస్లిముల కోరికపై ఆంగ్లేయుల పరిపాలనా కాలం (1937)లో ముస్లిమ్ పర్సనల్ లా (Muslim Personal Law - Shariat - Application Act : 1937) ప్రవేశపెట్టబడింది.

ముస్లిమ్ పర్సనల్ లా లో దీనికిగల మరో పేరు "షరీఅత్ యాక్ట్ (చట్టం)— 1937." ఇందులో ఏమని ఉందంటే దావేదారులు(వ్యాజ్యకారులు) ముస్లిములు అయిన పక్షంలో వివాహం, మహర్, మనోవర్తి, తలాక్, ఖులా, నికాహ్ రద్దు, విలాయత్, హిబా, వారసత్వం, వక్ఫ్— ఇత్యాది విషయాలలో నిర్ణాయక

* చూడండి— Chamber's Encyclopeadia Vol. IX P. 468.

శాసనం (Rule of Decision), ముస్లిమ్ పర్సనల్ లా (షరీఅత్) ప్రకారమే ఉంటుంది అని.

దీని తరువాత క్రీ శ. 1939లో పీగిపోయిన ముస్లిముల వివాహ రద్దు చట్టం (Disssolution of Muslim Marriages Act : 1939) ఒకటి ప్రవేశపెట్టబడింది. ఆ చట్టంలో— ఒక ముస్లిమ్ మహిళ తన భర్త నుండి విడిపోదలిస్తే, ఆ మేరకు ఆమె న్యాయస్థానాన్ని ఆశ్రయించేందుకు కావలసిన కారణాలను (Grounds) నిర్ణయించబడ్డాయి. ఉదాహరణకు, భర్త గనక నాలుగేళ్ళ నుండి చెప్పాపెట్టకుండా ఎక్కడికయినా వెళ్ళిపోవడమో లేదా అతను తనపై దౌర్జన్యానికి, వేధింపుకు ఒడిగడుతుండటమో చేస్తే లేదా భర్త సుఖవ్యాధులకో, దీర్ఘకాలిక వ్యాధులకో గురై ఉంటే నికాహ్ రద్దు విషయమయి ఆమె కోర్టు నుండి ఉత్తర్వు (Decree)ను పొందగలదు.

దీనిద్వారా అవగతమయ్యేదేమిటంటే ముస్లిం పర్సనల్ లా షరీఅత్ కేవలం నికాహ్, తలాక్, ఖులా, వారసత్వం మొదలగు ఆదేశాలతో మాత్రమే ముడిపడిలేదు— దాని పరిధి అంతకన్నా విస్తృతమయినది. కేవలం నికాహ్ మరియు విడాకుల నిబంధనావళి మాత్రమే కాక, మొత్తం వారసత్వ వ్యవస్థ కూడా అందులోకి వచ్చేస్తుంది. ఈ వ్యవహారాలకు సంబంధించిన ఏ అంశం వివాదాస్పదంగా ఖరారైనా న్యాయస్థానం దాని తీర్పును షరీఅత్ చట్టం ప్రకారం ఇవ్వటానికి నిబద్ధమయి ఉంది. ఉదాహరణకు, ఏ స్త్రీ అయినా తన భర్త వేధింపుకు విసుగెత్తిపోయి అతన్నుండి విడిపోదలిస్తే, మరో వంక భర్త అందుకు అంగీకారం తెలుపకపోతే అట్టి పరిస్థితిలో ఆ స్త్రీ ధర్మాసనం ద్వారా నికాహ్ ఒప్పం

దాన్ని రద్దు చేయించగలదు. లేదా ఇస్లామ్ నిర్ణయించిన వారసత్వపు హక్కును భర్త ఇవ్వకపోయినాసరే ఆమె న్యాయస్థానాన్ని ఆశ్రయించి తన హక్కును సాధించగలదు

ముస్లిమ్ పర్సనల్ లా కోడీకరణ (Codification) అంటూ జరగకపోయినప్పటికీ సూత్రప్రాయంగా షరీఅత్‌కు గల ప్రామాణికతను ఒప్పుకోవటం వల్ల ఇస్లామీ ఫికహ్ (ఇస్లాం ధర్మశాస్త్రం)కు చట్ట స్థాయి ప్రాప్తించింది. పైగా న్యాయస్థానాల సౌకర్యార్థం ఆంగ్లంలో "ముహమ్మడెన్ లా" పేరుతో అనేక గ్రంథాలు వెలువడ్డాయి. ఉదాహరణకు, ముల్లా రచించిన "ప్రిన్సిపుల్స్ ఆఫ్ ముహమ్మడెన్ లా" (Principles of Mohammadan Law). ఎ ఎ ఫైజీ వ్రాసిన "ఔట్ లైన్స్ ఆఫ్ ముహమ్మడెన్ లా" (Out Lines of Mohammadan Law) ఎన్నదగినది. హనఫీ ఫికహ్‌కు సంబంధించిన ప్రామాణిక గ్రంథం "హిదాయ" ఆంగ్లానువాదం కూడా అచ్చయింది. దాన్ని ప్రమాణంగా తీసుకుని న్యాయవాదులు న్యాయస్థానాల్లో తీర్పులు కోర్తారు. న్యాయస్థానాలు కూడా ఇస్లామీయ ధర్మశాస్త్రం ప్రకారం తీర్పు ఇవ్వవలసి ఉంటుంది. స్వాతంత్ర్యం తరువాత కూడా ఈ పరిస్థితి కొనసాగింది. దైవ కృప వల్ల ఇప్పటికీ ఈ స్థితే దాదాపు కొనసాగుతోంది. కాకపోతే కొన్ని పాక్షిక విషయాలలో ప్రస్తుత న్యాయస్థానాల ద్వారా ఇస్లామ్ శాసనాల ఉద్దేశ్యం నెరవేరటం లేదనేది వేరే విషయం. ప్రస్తుతం దేశంలో నెలకొన్న పరిస్థితుల దృష్ట్యా ఈ విషయమై ఇంతకన్నా ఎక్కువ ఆశలు పెట్టుకోనూ లేము.

# ముస్లిం పరన్సల్ లా ప్రాముఖ్యత

నికాహ్, తలాక్, ఖులా మరియు వారసత్వం— ఇవేవో అల్లాటప్పా విషయాలు కావు. ఈ వ్యవహారాల్లో అడ్డదారులు తొక్కి, తన మనోవాంఛల కనుగుణంగా శాసనాలను రూపొందించేందుకు ఇస్లామ్ ఎవరికీ స్వేచ్ఛనివ్వదు. పైగా ఇందలి ఒక్కొక్క విషయంపై స్పష్టమైన ఖుర్ఆన్ ఆదేశాలు ఉన్నాయి. ఆ ఆదేశాల ప్రస్తావన వచ్చినప్పుడల్లా వాటిని తు.చ. తప్పకుండా పాటించవలసి ఉందని కూడా నొక్కి చెప్పటం జరిగింది. వాటి ఉల్లంఘనకు ఒడిగట్టేవారిని గట్టిగా హెచ్చరించటం కూడా జరిగింది. ఉదాహరణకు నికాహ్ (వివాహం)కు సంబంధించిన ఆదేశాలు వివరించిన వెంటనే ఖుర్ఆన్‌లో "ఇది అల్లాహ్ శాసనం. దీనికి మీరు విధిగా కట్టుబడి ఉండాలి"(నిసా : 24) అని సెలవీయబడింది. అలాగే తలాక్, ఖులాల గురించిన ఆదేశాలు వివరించిన తరువాత "ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు. కాబట్టి వీటిని ఉల్లంఘించకండి. మరెవరు అల్లాహ్ హద్దులను ఉల్లంఘిస్తారో వారు తమ స్వయానికే అన్యాయం చేసుకున్నవారవుతారు" (అల్ బఖర : 229) అని చెప్పటం జరిగింది వారసత్వ నియమాలను గురించి చెబుతూ "ఇది అల్లాహ్ తరఫున విధించబడిన భాగాలు" (అన్ నిసా : 11) అని చెప్పబడింది. ఇకపోతే ; వారసత్వ వ్యవస్థ గురించి చేసిన ఉపదేశాల ముగింపు క్రింది వచనంతో జరిగింది :

> "ఎవరయితే అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు అవిధేయత చూపుతాడో అల్లాహ్ నిర్ణయించిన హద్దుల్ని అతిక్రమిస్తాడో అతణ్ణి అల్లాహ్ అగ్నిలో పడవేస్తాడు. అందులో

అతను కలకాలం ఉంటాడు. అతనికి తీవ్ర అవమానంతో కూడుకున్న శిక్ష పడుతుంది." [అన్ నిసా : 14]

దివ్య ఖుర్ఆన్‌లోని సమాజపరమయిన ఆదేశాలను దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) విడమరచి చెప్పారు. అవి 'సున్నత్'గా వ్యవహరించబడతాయి. ముస్లిమ్ సమాజంలోని ప్రముఖ ధర్మశాస్త్రవేత్తలు (ఫుకహాలు) ఖుర్ఆన్, హదీసుల వెలుగులో పరిశోధన జరిపి—ధర్మశాస్త్ర అన్వయింపుపై ఒక నిర్ధారణకు వచ్చి—ఇస్లామీ ఫికహ్‌ను సంకలనం చేశారు. సమాజం మరియు కుటుంబ జీవితంతో ముడిపడి ఉన్న ఖుర్ఆన్ హదీసుల ఆదేశాలు ఇస్లామ్ షరీఅత్ యొక్క అతి ముఖ్యమైన భాగాలుగా పరిగణించబడతాయి. ఇంకా వాటికి దైవ శాసనాల, దేవుని ఉత్తర్వుల స్థాయి ఉంటుంది. షరీఅత్ యొక్క సంపూర్ణ విధేయత గురించి దివ్య ఖుర్ఆన్‌లో ఆదేశాలు వచ్చాయి—

1) "విశ్వసించినవారలారా! మీరు పూర్తిగా ఇస్లామ్‌లో ప్రవేశించండి." [అల్ బఖర : 208]

2) "ప్రజలారా! ఏదయితే మీ ప్రభువు తరఫు నుండి మీపై అవతరింపజెయ్యబడిందో, దాన్ని అనుసరించండి. మీ ప్రభువును త్రోసిరాజని ఇతర సంరక్షకుల్ని అనుసరించకండి." [ఆరాఫ్ : 3]

3) "(ఓ ప్రవక్తా!) మీరు అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం ప్రజల వ్యవహారాలను పరిష్కరించండి; వారి కోరికల్ని అనుసరించకండి. మిమ్మల్ని మీరు మోసంలో

పడవేసి అల్లాహ్ మీ వద్దకు పంపిన జ్ఞానమార్గానికి
విముఖులు చెయ్యకుండా మీరు అప్రమత్తులై
ఉండండి" [అల్ మాయిద : 49]

దైవాదేశాలు, దైవ శాసనాలుండగా తనకు నచ్చిన చట్టాలను నిర్మించుకునే అధికారం, తన మనసు మెచ్చిన విధానాన్ని అవలంబించే అధికారం ఏ ముస్లిమ్‌కూ లేదు :

"విశ్వాసి అయిన ఏ పురుషునికిగాని, విశ్వసించిన మరే
స్త్రీకిగాని అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త విషయ
నిర్ణయం చేసివేసిన తరువాత తమ స్వవిషయంలో ఎలాంటి
అధికారమూ ఉండదు." [అహ్‌జాబ్ : 36]

దైవ శాసనానికనుగుణంగా నిర్ణయాలు చేయనివారు ధిక్కారులు, స్వయంకృతాపరాధులు, అవిధేయులు అనబడతారు. అలాగే ధర్మంలోని ఒక అంశాన్ని గ్రహించి మరో అంశాన్ని విడనాడటాన్ని అత్యంత ఆక్షేపణీయమయినదిగా పరిగణించి ఇలా మందలించటం జరిగింది :

"మీరు దైవ గ్రంథంలోని ఒక భాగాన్ని విశ్వసించి మరొక
భాగాన్ని తిరస్కరిస్తారా ?" [అల్ బఖర : 85]

నిసా సూరాలో సామాజిక కట్టుబాట్ల గురించి విపులంగా వచ్చింది. ఆ సూరాలోనే అంతిమ దైవ ప్రవక్త (సఅస)ను ఉద్దేశ్యించి పరమ ప్రభువు ఎంతో స్పష్టంగా సెలవిచ్చాడు :

"(ఓ ముహమ్మద్ !) నీ ప్రభువు సాక్షిగా ! వారు తమ
పరస్పర విభేదాల్లో నిన్ను న్యాయనిర్ణేతగా స్వీకరించనంత-
వరకు, ఇంకా నీవు ఏ నిర్ణయం చేసినా దాన్ని గురించి

వారి మనస్సుల్లో ఏ మాత్రం సంకోచం లేకుండా దాన్ని సంపూర్ణంగా శిరసావహించనంతవరకు వారు విశ్వసించిన వారు కాలేరు." [అన్ నిసా : 65]

ముస్లిమ్ పర్సనల్ లాను వ్యతిరేకిస్తున్నవారు అనేదేమిటంటే ; ముస్లిమ్ పర్సనల్ లా షరీఅత్‌లోని భాగమయినంత మాత్రాన దాని నిర్మూలన పట్ల ఎవరూ కళవళపడనవసరం లేదు. ఎందుచేతనంటే ఇస్లామ్ క్రిమినల్ చట్టం (Criminal Law) కూడా షరీఅత్‌లోని ఒక భాగమైనప్పటికీ ఇంతకుముందు దాన్ని రద్దుపరచటం జరిగింది. ప్రస్తుతం దేశంలో ఇస్లామేతర క్రిమినల్ శాసనమే అమలులో ఉంది. అటువంటప్పుడు ముస్లిమ్ పర్సనల్ లా మార్పు పట్ల హైరానా పడవలసిన అవసరం ఏమిటి ?— ఇది కూడా వింత వాదనే. ఒక వ్యక్తి గత్యంతరం లేక దుర్గంధభరితమయిన వాతావరణంలో గాలి పీలుస్తున్నాడనుకోండి. అతనికి లభ్యమయ్యే స్వచ్ఛమయిన వాయువు మార్గాలను కూడా మూసివేసి కేవలం దుర్గంధభరితమైన వాయువునే అతని కోసం వదలాలనడం భావ్యమేనా ? అది న్యాయమేనా ?? ఇస్లామ్‌కు చెందిన ఏ శాసనమయినా— అది క్రిమినల్ అయినా, సివిల్ అయినా, మరేదయినా— అది తన స్థానంలో పూర్తి ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటుంది. ఇంకా దాని శాసనాలన్నీ సరిసమానంగా గౌరవించదగినవే. ఏ షరీఅత్ చట్టాన్నయినా సరే రూపుమాపే ఆలోచన ఒక ముస్లిమ్ మనసులో మెదలనేజాలదు. అయితే దురదృష్టవశాత్తు క్లిష్ట పరిస్థితులు అసన్నమయి, కాలపు ఎలికలెపరయినా ఇస్లామ్ క్రిమినల్ చట్టం బదులు మరే చట్టాన్నయినా రుద్దారే అనుకోండి— దాన్ని అసరాగా చేసుకుని

మిగిలి ఉన్న ఇస్లామ్ చట్టాలకు కూడా చెల్లుబాటు ఇవ్వాలనడం ఎంతవరకు సమంజసం ?

మరి క్రిమినల్ చట్టాలకీ — సివిల్ చట్టాలకీ మధ్యనున్న తేడాపాడాలను ఈ ప్రబుద్ధులు బొత్తిగా విస్మరించి రెంటినీ ఒకే గాట కట్టేస్తున్నారు. క్రిమినల్ చట్టాల సంబంధం చాలావరకు ప్రభుత్వంతోనూ, పరిపాలనా యంత్రాంగంతోనూ ఉంటుంది. ఉదాహరణకు, ఒక దొంగకైనా, వ్యభిచారికైనా శిక్ష విధించేది ప్రభుత్వమేగాని వ్యక్తులు కాదు, అయితే సమాజపరమయిన చట్టాలను, కట్టుబాట్లను వ్యక్తులు తమకు తాముగా అవలంబించ వలసి ఉంటుంది. వాటితో ప్రభుత్వానికి గల సంబంధం నామ మాత్రమయినది. అంటే కేసుల పరిష్కారానికి సంబంధించి నంతవరకే ప్రభుత్వ జోక్యం ఉంటుంది. ఇంకో విషయం ఏమిటంటే సామాజిక శాసనాలను రూపుమాపే పక్షంలో వ్యక్తుల నీతినడవడికలపై దాని దుష్ప్రభావం పడే ప్రమాదముంది. ఉదాహరణకు, ఒకవేళ ఎవరయినా ఒక వ్యక్తి తన భార్యకు విడాకులు ఇచ్చేసి ఉంటే, అదే సమయంలో మరోవంక విడాకులు చట్టవిరుద్ధమని ఖరారయి ఉంటే— అట్టి పరిస్థితిలో షరీఅత్ దృష్ట్యా ఆవిడ అతని భార్య అయి ఉండదు. కాని చట్టపరమయిన ఆంక్షల మూలంగా ఆవిడ ఇప్పటికీ అతని భార్యగానే వర్ధిల్లుతుంటుంది. అటువంటప్పుడు భార్యకాని భార్య, మరియు భర్తకాని భర్త అయిన ఆ ఇద్దరు స్త్రీ పురుషుల సామాజిక, నైతిక స్థాయి అడుగంటిపోవటంలో సందేహమేముంది ? అదే క్రిమినల్ చట్టమయితే దాని పరిస్థితి ఇందుకు భిన్నమయినది. క్రిమినల్ చట్టాల సంబంధం నేరస్థులను

శిక్షించటం వరకే ఉంటుంది. కాబట్టి ఎప్పుడో కొన్ని దశాబ్దాల క్రితం రద్దుచేయబడిన ఇస్లామ్ క్రిమినల్ చట్టాన్ని ఇప్పుడు పర్సనల్ లా గొంతునులిమే ఉద్దేశ్యంతో ఉదాహరించడం ఏ విధంగానూ న్యాయసమ్మతం కాదు.

## భారత రాజ్యాంగం : 44వ నిబంధన

ముస్లిమ్ పర్సనల్ లాను మార్చాలంటూ దేశంలో ఒక ఉద్యమం నడపబడుతోంది. ముస్లిమ్ పర్సనల్ లాను పూర్తిగా తుదముట్టించి - దాని స్థానే అన్ని వర్గాలకు, అన్ని మతాలవారికి సమానంగా వర్తించే ఒక సివిల్ కోడ్‌ను ప్రవేశపెట్టాలన్నది దాని ప్రధాన ఉద్దేశ్యం. ఇంకా దాని పరమార్థం ఏమిటంటే ఒక ముస్లిమ్‌కీ - ముస్లిమేతర పౌరునికీ మధ్య ఎటువంటి విచక్షణ ఉండకూడదు, ఇస్లామ్ లేదా మరే ఇతర మతానికి చెందిన కుటుంబ చట్టం కూడా తనదయిన వైశిష్ట్యాన్ని కాపాడుకునే విధంగా మిగిలి ఉండకూడదు అన్నది. అసలు ఈ ఉద్యమానికి ప్రేరణ పాశ్చాత్య నాగరికత. దీనికి పునాది పదార్థ ప్రధానమైన జీవన దృక్పథం. అయితే రాజ్యాంగంలోని నిర్దేశిక సూత్రాల (Directive Principles)ను వివరిస్తున్న 44వ అధికరణ దీనికి ఓ ప్రాతిపదికను సమకూర్చిపెట్టింది. 44వ అధికరణలో ఇలా ఉంది :

> The State shall endeavour to secure for citizens a Uniform Civil Code throughout the territory of India.
>
> "యావద్దేశంలో పౌరుల కోసం ఉమ్మడి సివిల్ కోడ్‌ని రూపొందించేందుకు రాజ్యం కృషిచేస్తుంది."

అయితే రాజ్యాంగంలోని ఈ అధికరణ ఇతర నిర్దేశిక సూత్రాల వలెనే కేవలం నిర్దేశిక సూత్రాల స్థాయిని మాత్రమే కలిగి ఉంటుంది. అంతేగాని ఏ క్షణంలో కూడా అది రాజ్యాంగం లోని ప్రాథమిక హక్కుల (Fundamental Rights)తో సరి తూగదు. ప్రాథమిక హక్కులకు ఎట్టి పరిస్థితిలోనూ నిర్దేశిక సూత్రాలపై ఆధిక్యత ఉంటుంది. ఆ విషయమే ఇలా పేర్కొన బడింది :

> "ప్రజలందరికీ సమానంగా భావప్రకటనా స్వాతంత్ర్యం ఉంటుంది. తమకు నచ్చిన మతాన్ని స్వేచ్ఛగా స్వీకరించే, దాన్ని అవలంబించే, దాన్ని ప్రచారం చేసుకునే హక్కు కూడా వారికి ఉంటుంది." [అధికరణ : 25]

మత స్వాతంత్ర్యానికి ఉద్దేశించిన ఈ అధికరణ దృష్ట్యా ఏదేని ఒక వర్గానికి చెందిన మత స్వాతంత్ర్యాన్ని కబళించే, అది తన మత బోధనలకు విరుద్ధంగా ఆచరించేందుకు బలాత్కరించే ఎటువంటి "సివిల్ కోడ్"కూ అవకాశం ఉండకూడదు. ఒకవేళ అలాంటిదేదయినా జరిగితే అది నేరుగా మతంలో ప్రభుత్వ జోక్యంకిందికే వస్తుంది. అదేగనక జరిగేట్టయితే 'ప్రజలందరికీ తమ మతధర్మాన్ని అవలంబించే పూర్తి స్వేచ్ఛ ఉంటుంద'న్న రాజ్యాంగ హామీకి అర్థం లేదు. రాజ్యాంగంలోని ఇంత ముఖ్యమయిన ప్రాథమిక హక్కును చాటిచెబుతున్న అధికరణ (25)ను విస్మరించి నిర్దేశిక నియమానికి సంబంధించిన 44వ నిబంధననే వీళ్ళు పట్టుకోవడం కడు విచిత్రం కదూ ?!

ఇక నిర్దేశిక నియమాల (Directive Principles) విషయానికి వద్దాం. మద్యపాన నిషేధం కూడా నిర్దేశిక నియమాల్లోనిదే.

దాన్ని అమలుపరిచే విషయంలో నిజానికి ఏ మతమూ అడ్డు పడటంలేదు. మరి ఎన్ని రాష్ట్రాలు ఈ నిషేధాజ్ఞను అమలు పరుస్తున్నాయి? కొన్ని రాష్ట్రాలయితే క్రమక్రమంగా ఆంక్షల్ని సడలించటం మొదలెట్టాయి. ఉదాహరణకు, కేరళనే తీసు కోండి, అక్కడ మద్యనిషేధం ఉత్తర్వు ఎత్తివేయబడింది. మహారాష్ట్ర ప్రభుత్వం మొదట్లో మెతక వైఖరిని అనుసరించేది. ఇప్పుడదీ లేకుండా పొంతం వదిలేసింది. రాజ్యాంగంలోని ఒక నిర్దేశిక నియమం పట్టు నుండి తమను విముక్తం చేసుకోవటానికి వీలయినన్ని తరుణోపాయాలను వెతికిపట్టుకుంటూ, అదే సమయంలో మతావలంబనలో జోక్యానికి అస్కారమిచ్చే వివాదా స్పదమయిన మరో నిర్దేశిక నియమాన్ని బలవంతాన రుద్దడానికి ప్రయత్నిస్తున్నారు. ఇదేమి న్యాయం? ఇదేమి ధర్మం?

తేలిందేమిటంటే సంవిధానంలోని 44వ అధికరణ యథా తథంగా ఉన్నంత కాలం కామన్ సివిల్ కోడ్ కరవాలం వ్రేలాడు తూనే ఉంటుంది. ముస్లిమ్ పర్సనల్ లాకు ప్రమాదం పొంచి ఉంటుంది. ముస్లిమ్ పర్సనల్ లాలో మార్పులు చేయబోమని పాలక వర్గంవారు ఎన్ని హామీలిచ్చినా, మరెన్ని వాగ్దానాలు చేసినా ప్రమాదం మాత్రం తొలగిపోదు. ఎందుకంటే పాలకులు చేసే వాగ్దానాల సంగతి మనకు తెలియనిది కాదు.

అదలా ఉంచితే ప్రజాస్వామిక వ్యవస్థలో రాజ్యాధికారం ఒకరి వద్ద ఉండదు. అది తరచూ చేతులు మారుతూ ఉం టుంది. నేడు అధికార స్థానంలో ఉండి హామీల అభయం ఇచ్చినవారు రేపు ఆ స్థానంలో ఉండకపోవచ్చు. అదీగాక నేడు వాగ్దానాలు చేసిన నాయకుల అనుయాయులు రేపటి రోజున ఆ

మాటలకు కట్టుబడి ఉంటారన్న నమ్మకం ఏమిటి ? కాబట్టి రాజ్యాంగంలోని సదరు అధికరణ (44)ను తీసివేయటమో లేదా దానివల్ల ముస్లిమ్ పర్సనల్ లా భద్రతకు ఎలాంటి ముప్పు వాటిల్లకుండా ఉండే రీతిలో దాన్ని సవరించటమో చేయాలి. ఇది అత్యంత అవసరం.

రాజ్యాంగ నిర్మాణ సభలో రాజ్యాంగ మండలి 44వ అధికరణపై సమాలోచన జరుగుతున్నప్పుడు ముస్లిమ్ సభ్యులు అనేక సవరణలను సూచించారు. శ్రీయుత ఇస్మాయిల్ (మద్రాసు)గారు ప్రతిపాదించిన సవరణ ఇలా ఉంది :

Provided that any Group, Section or Community of People shall not be obliged to give up its own Personal Law, in case it has such a Law. (Directive Principles in the Indian Constitution By K. C. Merkenden P. 193)

"అయితే దీనివల్ల సమాజంలోని ఏ వర్గం, విభాగం లేదా మత వర్గంపై, అది తన వ్యక్తిగత చట్టాన్ని— అటువంటి చట్టం అంటూ ఏదయినా దానికున్నట్లయితే— విడనాడాలన్న నియమం విధించడం జరగదు."

శ్రీ నజీరుద్దీన్‌గారు సూచించిన సవరణ ఇలా ఉంది—

**Provided that the Personal Law of any Community which has been guaranteed by the State shall not be changed except with the previous approval of the Community ascertained in such manner as the Union Legislature may determine by Law.**

**(-do- Page : 193)**

"కాని ఏదేని మత వర్గపు వ్యక్తిగత చట్టం గురించి రాష్ట్రం

హామీ ఇచ్చి ఉంటే దాన్ని మార్చటం జరగదు. సదరు మత వర్గం నుండి ఆ మేరకు యూనియన్ చట్టసభ ద్వారా నిర్ణయమైయిన చట్టం ద్వారా పొందిన అనుమతి ముందుగానే లభిస్తే అలా మార్చవచ్చు."

ఈ సవరణను సూచిస్తూ శ్రీ నజీరుద్దీన్, రాజ్యాంగంలోని ఈ అధికరణ (44వ అధికరణ) మత స్వాతంత్ర్యాన్ని గురించి వివరిస్తున్న అధికరణతో ఘర్షణపడే విధంగా ఉన్నదని, ఇంకా అందులో ఇవ్వబడిన (మత స్వేచ్ఛ) హామీని ఈ అధికరణ (44) హరించే అవకాశం కూడా ఉందని భయాందోళనను వెలిబుచ్చారు.

మూడవ సవరణను మహబూబ్ అలీ బేగ్ బహదూర్ (మద్రాసు) ప్రతిపాదించారు. ఆయన ఇలా అన్నారు :

> Provided that nothing in this Article shall affect the Personal Law of the Citizen. (-do- P. 193)
>
> "అయితే ఈ అధికరణలోని ఏ అంశమూ పౌరుల వ్యక్తిగత చట్టంపై మాత్రం ప్రభావం వేయరాదు."

శ్రీ బి. పోకర్ సాహెబ్ బహదూర్ (మద్రాసు) చేసిన ప్రతిపాదన ఇంచుమించు ముహమ్మద్ ఇస్మాయీల్‌గారి ప్రతిపాదననే పోలి ఉంది.

పార్లమెంటు సభ్యులు సూచించిన ఆయా సవరణలపై ఆనాడు రాజ్యాంగ నిర్మాణ సభలో వేడివాడిగా చర్చలు జరిగాయి. ఆ చర్చల్లో పాల్గొన్నవారిలో కె.ఎం. మున్షీ ఎం ఆర్. మసానీ, ఎ. కె. అయ్యర్ వంటి హేమాహేమీలు ఉన్నారు. ఒక దశలో కె ఎం. మున్షీ ఈ విధంగా కూడా పలికారు :

**It was the desire of the framers of the Constitution to divorce from Personal Law. (-do- P. 195)**

"పర్సనల్ లా నుండి విడాకులు ఇప్పించాలన్నది ఈ రాజ్యాంగ రూపకర్తల అభిలాషలా ఉంది."

ఈయన తన ప్రసంగంలో టర్కీ, ఈజిప్ట్‌లలోని సంస్కరణలను కూడా ఉదాహరించారు. అయితే యూనిఫాం సివిల్ కోడ్‌ను వారిపై బలవంతంగా రుద్దేవిలేదని ఆ సందర్భంలో డా. అంబేద్కర్ ముస్లిములకు అభయమిచ్చారు.

ఆయన ఇంకా ఇలా అన్నారు :

"యూనిఫాం సివిల్ కోడ్‌కు మనఃపూర్వకంగా తాము కట్టుబడి ఉంటామని ప్రకటించేవారికి మాత్రమే ఇది వర్తించేలా భావిలో చట్టం చేయడం పార్లమెంటు పని అవుతుంది." అంబేద్కర్ ఈ హామీని ఇచ్చిన తరువాత పైన ప్రస్తావనకు వచ్చిన వివిధ సూచనలు త్రోసిపుచ్చబడ్డాయి. ఆఖరికి నేడు 44వ అధికరణ రూపంలో ఉన్న ముసాయిదాను ఆమోదించటం జరిగింది.

శ్రీ ముహమ్మద్ ఇస్మాయీల్ (మద్రాసు)గారైతే ఇంకా ముందుకుపోయి — ముస్లిమ్ పర్సనల్ లా రక్షణకై— రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులను ఉద్దేశించిన అధికరణలలో సయితం క్రింది అంశాన్ని చేర్చాలని పట్టుబట్టారు :

**To follow the Personal Law of the groups or community to which he belongs or professes to belong.**

**(Constituent Assembly Debates, Vol : VII P. 721)**

"అతను ఏ వర్గంతో లేక ఏ మత వర్గంతో సంబంధం కలిగి ఉంటాడో లేదా సంబంధం పెట్టుకున్నట్లు ప్రకటిస్తాడో ఆ వర్గం యొక్క పర్సనల్ లాను అవలంబించవచ్చు (ఆ మేరకు అతనికి పూర్తి స్వేచ్ఛ ఉండాలి)"

అయితే రాజ్యాంగ నిర్మాణ సభ ఈ సూచనను కూడా సమ్మతించలేదు. నేడు ముస్లిమ్ పర్సనల్ లా విషయమయి మనం ఏ ముప్పును ఎదుర్కొంటున్నామో దాన్ని గురించి రాజ్యాంగ రూపకల్పన సమయంలోనే దూరదృష్టి గల మేధావులు పసిగట్టారు. ఇక అంబేద్కర్ హామీలంటారా, వాటి సంగతి పాలకులకు నేడు ఏ మాత్రం గుర్తులేదు కాబట్టి ఇప్పుడు మరిన్ని హామీల, అభయాల అవసరం ఏమీ లేదు. ఇప్పుడు అవసరమయినదల్లా రాజ్యాంగాన్ని సవరిస్తూ ముస్లిములకు తమ పర్సనల్ లాను అవలంబించే పూర్తి స్వేచ్ఛ ఉంటుందని తిరుగులేని విధంగా భారత రాజ్యాంగంలో సవరణ జరగడమే. అంతవరకూ ముస్లిమ్ పర్సనల్ లా నెత్తిపై 'యూనిఫాం సివిల్ కోడ్' ఖడ్గం వ్రేలాడుతూనే ఉంటుంది.

## రాజ్యము - దాని సెక్యులర్ స్వభావం

ముస్లిమ్ పర్సనల్ లాను వ్యతిరేకించేవారు మాటిమాటికీ రాజ్యం, దాని సెక్యులర్ స్వభావాన్ని ఉదాహరిస్తూ ఉంటారు. సెక్యులరిజం కోరేదాని ప్రకారం దేశ పౌరులందరి కుటుంబ చట్టాలలో సమత్వం ఉండాలన్నది వారి అభిమతం. వివిధ మత వర్గాలవారి కోసం వేర్వేరు కుటుంబ చట్టాలు (Family Laws) ఉంటే వారి మధ్య వివక్షణ (Discrimination) చూపి

పక్షాల్లో అవుతుందని, ఇది సెక్యులరిజం స్వభావానికే సరిపడని విషయం అని వీరు వాదిస్తారు.

ప్రపంచ చిత్రపటంలో ఒక్క ఇండియా మాత్రమే సెక్యులర్ దేశమా? ప్రపంచంలో మరే సెక్యులర్ రాజ్యమూ లేదా? అని ఈ అతివాద సెక్యులరిస్టులను అడగాలి. ముస్లిమ్ పర్సనల్ లా జోలికి కూడా పోని అనేకానేక సెక్యులర్ రాజ్యాల గురించి ఈ సోకాల్డ్ సెక్యులరిస్టులకు తెలీదులా ఉంది. ఉదాహరణకు థాయిలాండ్‌నే తీసుకోండి— అక్కడ బౌద్ధ మతస్థులు అధిక సంఖ్యలో ఉన్నారు. థాయి ప్రభుత్వం వారి కుటుంబ చట్టాలలో పెద్ద ఎత్తున సంస్కరణలను కూడా చేపట్టింది అయితే ఆ సంస్కరణలు బౌద్ధ మతానికి మాత్రమే పరిమితమయ్యాయి. ముస్లిములను దాన్నుంచి మినహాయించి, వారి వ్యక్తిగత చట్టాన్ని వారు అవలంబించేందుకు స్వేచ్ఛ ఇవ్వటం జరిగింది. బర్మాలోనూ ఇదే పరిస్థితి. గ్రీకు దేశంలో ముస్లిమ్ పర్సనల్ లా ముఫ్తీల (ఇస్లామ్ ధర్మవేత్తల) ద్వారా ప్రవేశపెట్టబడుతున్నది. ఆఫ్రికా దేశాలయిన ఇథియోపియా, ఘానా, గోల్డ్ కోస్ట్ యుగాండాలలో కూడా ముస్లిమ్ పర్సనల్ లా నిక్షేపంగా కొనసాగుతోంది.* ఈ దేశాలలో అధికాంశ దేశాల రాజ్యాంగం సెక్యులర్ ప్రాతిపదికపైనే ఉంది. మరికొన్ని రాజ్యాలైతే కమ్యూనిజం దృక్పథం గలవి. ముస్లిమ్ పర్సనల్ లా అమలులో ఉండటం వలన అక్కడి సెక్యులర్ వ్యవస్థలకు కలగని ఆటంకాలు భారత దేశంలోనే కలుగుతున్నాయా?

---

* చూడండి— Family Law Reform in the Muslim World by Tahir Mahmood. P. 4

## జాతీయ సమైక్యత

దేశంలో ఎప్పుడు, ఎక్కడ మతకలహం జరిగినా దానిపై రాజకీయవాదుల ప్రతిస్పందన ఒకే విధంగా ఉంటుంది— "జాతీయ సమైక్యత కొరకు యూనిఫాం సివిల్ కోడ్ (Uniform Civil Code)ను విధించవలసిన అవసరం ఉంది" అని. మత కలహాలకు మూలకారణం ముస్లిమ్ పర్సనల్ లాయే అన్నట్లు. దాన్ని గనక రద్దుచేసి యూనిఫాం సివిల్ కోడ్‌ను ప్రవేశపెడితే చాలు, మతకలహాల పరంపరకు బ్రేకు పడిపోతుందన్నట్లు వారు మాట్లాడ్తారు. ఈ 'రోగ నిర్ధారణ' చేస్తున్నది అల్లాటప్పా వైద్యులే కానట్లయితే, ముస్లిమ్ పర్సనల్ లా మూలంగా ఎప్పుడు, ఎక్కడ మతకలహం జరిగిందో చెప్పమని వారిని ప్రశ్నించాలి. భారత దేశంలో జరిగిన వేలాది మతకలహాలలో ఏ ఒక్కదానికయినా ముస్లిమ్ పర్సనల్ లా కారణభూతమై ఉంటే అదెక్కడో వారు చూపెట్టాలి, కలహ కారణాలను వెతికి పట్టుకునేందుకు ఇప్పటి వరకూ అనేకానేక విచారణ సంఘాలు నియమించబడ్డాయి. వాటిలో ఏ ఒక్క కమీషన్ అయినా తన నివేదికలో ఆ నరమేధానికి మూలం ముస్లిం పర్సనల్ లాయేనని పేర్కొన్నదా అని ప్రశ్నిస్తే సమాధానం 'లేదు' అనే వస్తుంది. మరి అలాంటప్పుడు మతకలహాలు జరిగినప్పుడల్లా ముస్లిమ్ పర్సనల్ లాను చర్చావేదికల పైకి ఈడ్చుకురావటంలోని ఔచిత్యం ఏమిటి ?

మతకలహాల సంగతి అలా ఉంచితే, వివిధ మతవర్గాల మధ్య భావనాపరమయిన సామరస్యాన్ని, భావ సామరస్యాన్ని, సృజించేందుకు యూనిఫాం సివిల్ కోడ్‌ని నిర్మించుకోవలసిన అవసరం ఉందని కోరే మహానుభావులు మరికొందరు. జస్టిస్

వై. వి. చంద్రచూడ్ ఒకసారి బొంబాయిలో ప్రసంగిస్తూ ఇలా అన్నారు :

> One Law of marriage for all would be an important step towards national integration.
>
> (Indian Express : 21-6-67)

> "అందరికీ ఒకే వివాహ చట్టం (ప్రవేశపెట్టినట్లయితే) అది జాతీయ సమైక్యత వైపుకు వేసే ముఖ్యమయిన అడుగు అవుతుంది"

కాని వాస్తవానికి ఇది తలాతోకలేని వాదన. ఎందుకంటారేమో, ఇటువంటి చర్యల ద్వారా తమ మత సాంస్కృతిక సంప్రదాయాలు రూపుమాపబడుతున్నాయన్న భావనే గనక అల్ప సంఖ్యాక జనుల్లో కలిగిందంటే దాని ప్రతిస్పందన తీవ్రంగా ఉండవచ్చు. దాని మూలంగా అల్పసంఖ్యాకులు - అధిక సంఖ్యాకుల మధ్యగల సత్సంబంధాలు దెబ్బతినవచ్చు. దీనికి భిన్నంగా— ప్రజాస్వామిక వ్యవస్థలో నిర్ణయాత్మక స్థాయిని కలిగి ఉన్న అధిక సంఖ్యాక వర్గం గనక అల్పసంఖ్యాకులతో ఉదార వైఖరిని అలవరచుకున్నట్లయితే, వివిధ వర్గాలవారికి వీలైనంత ఎక్కువగా మత సాంస్కృతిక స్వేచ్ఛను ఇచ్చినట్లయితే ఆయా వర్గాల మధ్య పరస్పర అవగాహన ఏర్పడుతుంది. సత్సంబంధాలు విస్తృత స్థాయిలో నెలకొంటాయి. ఈ సత్సంబంధాలు మత సామరస్యాన్ని, జాతీయ సమైక్యతను పెంపొందించడంలో దోహదపడతాయి. కుతర్కాలు, పిడివాదనలతో సమస్యలు పరిష్కారం కావు. ఏ తర్కం ఆధారంగానయితే యూనిఫాం సివిల్ కోడ్ ఆవశ్యకత గురించి నొక్కి చెబుతున్నారో ఆ తర్కాన్నే ఉపయోగించి రేపటి రోజున యూనిఫాం వర్షిప్ కోడ్ (Uniform

Worship Code) కావాలని కూడా కోరవచ్చు. మస్జిద్ అనీ, మందిరమనీ ఎందుకొచ్చిన గొడవ ? వీటన్నింటినీ కూల్చిపారేసి జాతీయ ఆరాధనాలయాల (National Temples)ను ఎందుకు నిర్మించుకోరాదు ? అక్కడ అన్ని మతవర్గాలవారు ఒకే వరుసలో నిలబడి జాతీయ స్మృతి (National Code) ననుసరించి ఉమ్మడి ఆరాధన చేసుకోవచ్చు. ఆ ఆరాధన కూడా దైవారాధనగాకుండా జాతి (National) ఆరాధనగా ఉంటే సరిపోతుంది అనే ఆలోచనలకు కూడా అంకురార్పణ జరుగుతుంది. దానికూడా ఒక లాజిక్‌ను జోడించవచ్చు. అదేమంటే, దేవుని పేరు ఎత్తిన చోటల్లా 'విశ్వాసాల' వాదులాటలు మొదలవుతాయి. దాన్నుండి వర్గాలు పుట్టుకువస్తాయి. వర్గాల నుండి వర్గ దురభిమానం జనిస్తుంది. కాబట్టి పాడేవాడే లేకపోతే పాట కచేరియే ఉండదన్నట్టు జాతీయ సమైక్యత కావాలంటే వీటన్నింటినీ ఎత్తివేయటం అనివార్యం! అయినా, ఇంత స్పష్టమయిన తర్కాన్ని చెప్పడానికి మన రాజకీయవాదులు ఎందుకు తడుముకుంటున్నారో !!

## నవ నాగరికత కోరేది

ముస్లిములలో ఒక వర్గం ఉంది. సంఖ్యా దృష్ట్యా అది చాలా చిన్నది. కాని అది "క్రొత్త వెలుగు"లో కళ్ళు తెరచింది. ఆధునిక పోకడల కనుగుణంగా ముస్లిమ్ పర్సనల్ లాలో మార్పులు జరగాలని అది కోరుతున్నది. దాని ఈ కోర్కెకు కారణం ఏమిటి ? షరీఅత్ చట్టాలు క్రూరమయినవనా ? వీటి మూలంగానే ముస్లిమ్ సమాజంలో చెడుగులు ప్రబలుతున్నాయని వారు భావిస్తున్నారా ? అందువల్లనే ఈ చట్టాలను సంస్క

రించాల్సిన ఆవశ్యకత ఉందని వారు తలపోస్తున్నారా? అంటే ఇదేదీ కాదు. తాను సృష్టించిన మానవుల ప్రయోజనాలను, వారి మనుగడను బాగా ఎరిగిన దేవుడు ఈ షరీఅత్ శాసనాలను అవతరింపజేసినపుడు అవి క్రూరమయినవనే ప్రశ్నే తలెత్తదు. అసలు విషయం ఏమిటంటే నవ నాగరికతా తళుకుబెళుకులను చూసేసరికి ఈ వర్గంవారి కళ్ళు జిగేల్‌మన్నాయి. దృష్టి చెదరిపోయింది. పాశ్చాత్య ప్రపంచం నుండి కానుకగా లభించిన 'న్యాయం,' 'సమానత్వం' వంటి అందమైన నినాదాల వరదలో కొట్టుకుపోతున్న ఈ నవతరానికి ఇస్లామ్ సామాజిక నియమాలు లోపభూయిష్టంగానే కనిపిస్తాయి మరి. వారి దృష్టిలో ఇస్లామ్ సామాజిక వ్యవస్థకు ఇప్పుడు కాలం చెల్లిపోయింది. ఎందుకంటే అది నేటి అధునాతన ధోరణులతో సమరసం చెందలేకపోతోంది. అందుచేత ఈ బంధనాల నుండి విముక్తులయి కొత్త పుంతలు తొక్కాలని, స్త్రీ పురుషులుభయులకూ సమాన స్థాయి ఉండే నవీన దృక్పథాల కనుగుణంగా సామాజిక వ్యవస్థను రూపొందించుకోవాలని వారు కోరుతున్నారు.

ఈ వర్గంవారే గనక విశాల హృదయంతో ఇస్లామ్ సామాజిక వ్యవస్థను అధ్యయనం చేసి ఉంటే, మానవ నైజాన్ని, అతని నైతికతా స్థాయిని విస్మరించకుండా ప్రశాంత మనసుతో ఆలోచించి ఉంటే ఇస్లామీయ వ్యవస్థలోని అద్భుతమయిన సమన్వయ సౌందర్యం, సమతూకం వారికి కానవచ్చేది. నిస్సందేహంగా ఇస్లామ్ స్త్రీపై పురుషుడికి ఒకింత అధిక్యతను ప్రసాదించింది. పురుషుణ్ణి కుటుంబ యజమానిగా చేసి ఈ అధిక్యతనిచ్చింది. పురుషుని స్వభావ స్వరూపాల దృష్ట్యా అతని

సహజ ప్రవృత్తుల దృష్ట్యా అతని శరీర నిర్మాణం తీరు రీత్యా ఈ అధిక్యతనివ్వడం జరిగింది. ఇలా అధిక్యత ఒకరికి లేనిదే కుటుంబ వ్యవస్థలో క్రమశిక్షణగాని, నైతిక విలువలుగాని మిగలవు. ఈ కారణంగానే ఇస్లామ్ 'తలాక్' అధికారం స్త్రీకి గాక పురుషుడికి ఇచ్చింది. అయితే 'ఖులా' హక్కు స్త్రీకి తప్పనిసరిగా ఉంటుంది. అలాగే తండ్రి ఆస్తిలో కొడుకుకు లభించే భాగంలో సగభాగమే కుమార్తెకు లభిస్తుంది. ఎందు కంటే సంపాదన. పోషణల బాధ్యత పురుషుడిపై ఉంది. అతను తన భార్యాబిడ్డల కోసం అన్నవస్త్రాలను ఏర్పాటు చేయ వలసి ఉంటుంది. అదీగాక స్త్రీ తన భర్త నుండి "మహర్" రూపంలో కూడా కొంత సొమ్మును పొందుతుంది. అందుచేత మానవ నైజం, న్యాయం, ధర్మాల రీత్యా కొడుకు కూతుళ్ళకు లభించే ఆస్తి భాగంలో వ్యత్యాసం ఉండాలి. కాని న్యాయం పేరిట అన్యాయ దండాన్ని త్రిప్పగోరుతున్న ఆధునిక నాగరికత ఈ యదార్థ దృష్టిని ఎప్పుడు గ్రహిస్తుందని? అదయితే 'సమా నత్వమే' సర్వస్వమని భావిస్తున్నది. కాగా, సమానత్వపు ఈ తీవ్ర ధోరణి మానవ ప్రకృతికి సరిపడదు. మానవులవడంచేత తండ్రీకొడుకులు సమానులే. సందేహం లేదు. అయినప్పటికీ తండ్రికి కొడుకుపై అధిక్యత ఉంది. తండ్రి పెద్దరికాన్ని, గౌరవాన్ని దృష్టిలో పెట్టుకుని వ్యవహరించటం కొడుకు బాధ్యత. కాబట్టి అతను తండ్రికి విధేయుడై మెలగవలసి ఉంటుంది. అయితే 'సమానత్వం' అనే అతివాద సిద్ధాంతాన్నే గనక అవలం బించినట్లయితే తండ్రీకొడుకులుభయులూ సమానులేనని, వారిరు వురిలో అంతస్తులకు తావు లేదని, తండ్రి చెప్పినట్లుగా కొడుకు వినవలసిన అవసరమే లేదని అనవలసివస్తుంది. ఇంకా, తండ్రి

ఆదేశాన్ని కొడుకు శిరసావహించనప్పుడు న్యాయం, సమానత్వం ప్రాతిపదికలపై కొడుకు ఆదేశాలను తండ్రి కూడా శిరసావహించాలని ఎందుకు భావించరాదు? అనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది.

## ముస్లిం దేశాలలోని ముస్లిం పర్సనల్ లా లో మార్పులు

ఆధునిక సిద్ధాంతాల కనుగుణంగా ముస్లిం పర్సనల్ లాలో మార్పులు తీసుకురావాలని కోరేవారంతా తమ వాదనకు ఆధారంగా ముస్లిమ్ దేశాలను ఉదాహరిస్తారు. ముస్లిమ్ దేశాలలోని పర్సనల్ లాలో మార్పులు చేస్తున్నప్పుడు భారత ముస్లిములు మార్పుకు అంగీకరించకపోవడానికి వీరేమన్నా ప్రపంచ ముస్లిం కంటే విలక్షణమయినవారా? అన్నది వారి ఆక్షేపణ ఇటువంటి ఆక్షేపణలు పరిస్థితుల నిజ స్వరూపాన్ని ప్రతిబింబించవు సరికదా, అవి అతిశయోక్తులతో ఓ తప్పుడు భావాన్ని కలిగింపజూస్తాయి.

యదార్థానికి ముస్లిమ్ దేశాలలో అధికాంశం దేశాల్లో ముస్లిమ్ పర్సనల్ లాలో ఎలాంటి మార్పులు జరగలేదు. పైగా అక్కడ షరీఅత్ శాసనాలే అమల్లో ఉన్నాయి. సఊదీ అరేబియా, యమన్, బహరెయిన్, కువైత్, ఖతర్, అబూ ధాబి దుబాయి, ఆఫ్ఘానిస్తాన్, మాల్దీవ్స్, గైనీ (GUINEA), సెనెగల్, సోమాలియా, నైజీరియాలు దీనికి ప్రబల నిదర్శనాలు. ఈ దేశాలలో ఒక చోట హంబలీ ఫికహ్ (ధర్మశాస్త్రం) ఉండగా

మరొక దేశంలో మాలికీ ఫికహ్ అమల్లో ఉంది. ఒక దేశంలో హనఫీ ఫికహ్‌కు చట్టపరమయిన స్థాయి ఉండగా వేరొక దేశంలో షాఫయి శాస్త్రానికి ఆ ప్రతిపత్తి ఉంది. సఊదీ అరేబియాలో హంబలీ శాస్త్రానికి చట్ట స్థాయి ఉంది. పైగా ఆ దేశ సంవిధాన నిర్దేశాల ప్రకారం ఏ శాసన నిర్మాణం జరిగినా అది ఖుర్ఆన్, హదీసులకు మరియు సహాబాల (ప్రవక్త సహచరుల) ఆదర్శ జీవితాలకు అనుగుణంగా ఉండాలి. యమన్‌లో జైదీ ఫికహ్ అమల్లో ఉంది. దక్షిణ యమన్‌లో* షాఫయి ఫికహ్ లేదా హనఫీ ఫికహ్‌ను అనుసరించటం జరుగుతుంది. బహరెయిన్‌లో మాలికీ, షాఫయి, షియా ఫికహ్‌లకు చట్ట స్థాయి ఉంది. ఎవరే శాస్త్రాన్ని అనుసరిస్తారో దాని ప్రకారం ఆయా వ్యక్తుల వ్యవహారాలు నిర్ణయించబడతాయి. కువైత్‌లో ఇస్లామ్ కుటుంబ చట్టం అమల్లో ఉంది. సాధారణంగా అక్కడ మాలికీ ఫికహ్**ను అనుసరిస్తారు. అఫ్ఘానిస్తాన్ సంవిధానం ప్రకారం అక్కడి రాజ్యధర్మం ఇస్లామ్. అక్కడి ధార్మిక వ్యవహారాలన్నీ హనఫీ ఫికహ్ ననుసరించి నిర్వర్తించబడతాయి. చెలామణిలోనున్న అక్కడి ఇస్లామీయ చట్టంలో ఎటువంటి మార్పు చేయబడలేదు. మాల్దీవ్స్‌లో కుటుంబ చట్టం షాఫయి విధానానికి అనుగుణంగా అమల్లో ఉంది. ఆఫ్రికా దేశాలయిన చాడ్, గాంబియా, గైనీ, మాలీ, మారతానియా, నైజీరియా, సెనగాల్ మరియు సోమాలియాలలో ఇంతవరకు ఇస్లామ్ కుటుంబ చట్టాలలో మార్పు

---

* రెండు యమన్‌లు ఇటీవల విలీనమయినాయని గమనించాలి.

** చూడండి— Family Law Reform in the Muslim World by Tahir Mahmood. P. 3

నిమిత్తం ఎలాంటి చర్య గైకొనబడలేదు. నైజీరియాలో మాలికీ శాస్త్రానికి కుటుంబ మరియు వారసత్వ చట్టాల స్థాయి ప్రాప్తించింది.

ఇక ఏ ముస్లిమ్ దేశాల్లోనయితే కుటుంబ చట్టాలలో సంస్కరణలు చేయబడ్డాయో, వాటిలో చాలావరకు వివిధ ఫికహ్‌లలో (శాస్త్రాలలో) ఏదో ఒక ఫికహ్ అంశాలకు చట్టపరమయిన ప్రతిపత్తి కల్పించే ఉద్దేశ్యంతో, కొన్ని తప్పిదాళ్ళను క్రమబద్ధంగా రూపకల్పననిచ్చే ఉద్దేశ్యంతో సంస్కరణలు చేయబడ్డాయి. వాటిలో చాలావరకు పరిపాలనా యంత్రాంగానికి సంబంధించినవేనన్న సంగతి మరువరాదు. పోతే; రెండే రెండు దేశాలు ఇస్లామ్ కుటుంబ చట్టాలను రూపుమాపి సెక్యులర్ తరహా సివిల్ కోడ్‌ను ప్రవేశపెట్టే సాహసానికి ఒడిగట్టాయి. ఆ రెంటిలో ఒకటి అల్బానియా, మరొకటి టర్కీ. టర్కీలో ఈ మార్పు 1926లోనే వచ్చింది. ఇస్లామ్‌లోని కుటుంబ చట్టాలు వారసత్వ చట్టాలను త్రోసిరాజని అక్కడ స్విట్జర్‌లాండ్ తరహా సివిల్ కోడ్‌ని విధించటం జరిగింది. అయితే టర్కీలో ముస్తఫా కమాల్ పాషా హయాంలో ఇస్లామ్‌ను చీల్చిచెండాడటానికి తీసుకోబడిన చర్యలూ బలప్రయోగంతో నాస్తికతా ప్రధానమైన రాజ్యాన్ని నెలకొల్పడానికి అక్కడ జరిగిన ప్రయత్నాల గురించి ఎవరికి తెలియదు గనక ? ఆఖరికి అక్కడ అరబీ భాషలో 'అజాన్' ఇవ్వటం పట్ల కూడా ఆంక్ష విధించబడింది. అందుచేత అటువంటి (ధర్మభ్రష్ట) దేశాన్ని ఉదాహరణగా చూపి మన దేశ ముస్లిమ్ పర్సనల్ లాలోనూ మార్పు రావాలని కోరటంలో అర్థం లేదు. ఇక్కడ విస్మరించరాని విషయం

మరొకటి ఉంది— అదేమంటే, ఏ ముస్లిమ్ దేశమైనా షరీఅత్ ఉద్దేశ్యానికి విరుద్ధంగా ముస్లిమ్ పర్సనల్ లాలో మార్పుకు పాల్పడటమో లేదా దాన్ని అంతమొందించి ముస్లిమేతర తరహా కోడ్‌ను విధించటమో చేస్తే దాన్ని షరీఅత్ మాత్రం ఎన్నటికీ సమ్మతించదు. ఇంకా, అటువంటి సవరణా చర్యలు ఇతర దేశాల ముస్లిములకు ఆదర్శప్రాయము కానక్కరలేదు మార్పు దృష్టితో ఇక్కడ మాటిమాటికీ టర్కీని ఉదాహరిస్తున్నవారు షరీఅత్ శాసనాలను యథాతథంగా అమలుపరుస్తున్న దేశాల దృష్టాంతాన్ని ఎందుకు ఉదాహరించరు ? అటువంటి దేశాలు ఒకటీ రెండూ కావు, అనేకం ఉన్నాయన్న సంగతిని మేము వెనుకటి పుటల్లో ప్రస్తావించి ఉన్నాము

ఇస్లామ్ కుటుంబ, వారసత్వ చట్టాలను రద్దుచేయటానికి ఇంతవరకు ఇస్రాయీల్ ప్రభుత్వం కూడా సాహసించలేదు. 1917లో తురుష్కులు షరీఅత్ వెలుగులో సంకలనం చేసిన కుటుంబ చట్టం— Ottoman Law of Family Rights 1917— ఈ చట్టాన్ని స్వయంగా టర్కీలో 1926లో రద్దుచేసివేసినా ఇప్పటికీ ఇస్రాయీల్‌లోని ముస్లిముల కొరకు అమల్లో ఉంది. ఇస్రాయీల్ ప్రభుత్వం ఈ చట్టాన్ని అక్కడి సాధారణ చట్టాలకు లోబడి ఉండేలా చేసిందన్నదొక్కటే అక్కడి మార్పు.

ఇక మిగిలింది పాకిస్తాన్ ముస్లిమ్ పర్సనల్ లాలో మార్పు అవసరమని కోరే ఔత్సాహికులు ఎంతో పటాటోపంతో పాకిస్తాన్ ఉదాహరణను ఇస్తారు. నిజానికి పాకిస్తాన్‌లో ఇప్పటికీ అమలులో ఉన్నది ముస్లిమ్ పర్సనల్ లాయే తప్ప మరొక సివిల్ కోడ్ కాదు. కాకపోతే “1961 కుటుంబ చట్టం” ద్వారా

అక్కడ కొన్ని 'సంస్కరణలు' చేయబడ్డాయి. అవి కూడా చాలావరకు పరిపాలనాపరమయినవి, లేక క్రమబద్ధత దృష్ట్యా చేసినవే. చేసిన ఆ ముఖ్య సంస్కరణల్లో ఒకటేమంటే; ప్రతీ ఒక్క వివాహాన్ని రిజిస్టరు చేయించటం తప్పనిసరి. ఒకవేళ ఎవరయినా రిజిస్టరు చేయించకపోయినా ఆ వివాహం ధర్మ విరుద్ధం కాబోదు. కాని రిజిస్టరు చేయించనందుకు కొంత జరిమానా పడుతుంది. రెండవదేమంటే, ఒక భార్య ఉండగా మరొక వివాహం చేసుకోగోరేవారు ఆర్బిట్రేషన్ కౌన్సిల్ (Arbitration Council) నుండి అనుమతిని పొందవలసి ఉంటుంది. ఎవరయినా అనుమతి పొందకపోయినట్లయితే అటువంటివారిపై జరిమానా పడుతుంది. అంతేగాని అటువంటి వివాహం చెల్లనేరదనో లేదా ఆ వివాహం అధర్మమని ఖరారు చేయటమో జరగదు. మూడవదేమంటే, భార్యకు విడాకులు ఇవ్వవలచిన పక్షంలో ఆ విషయాన్ని ఆర్బిట్రేషన్ కౌన్సిల్ దృష్టికి తీసుకురావటం భర్తపై తప్పనిసరిగావించబడింది. అప్పుడు ఆ కౌన్సిల్ ఆ దంపతుల వివాదంలో జోక్యం కల్పించుకుని వారి మధ్య సర్దుబాటు కోసం వీలయినంతవరకు ప్రయత్నిస్తుంది. దీన్ని బట్టి అవగతమయ్యేదేమంటే విడాకులిచ్చే అధికారాన్ని ఈ చట్టం పురుషుని నుండి గుంజుకోలేదు. దానికి బదులు అది ఒక నిబంధనానుసారం సర్దుబాటు కొరకు ఓ అవకాశం కల్పిస్తుంది. నాల్గవ 'సంస్కరణ' వారసత్వానికి సంబంధించినది. దీని ప్రకారం తండ్రిలేని మనవడికి, తండ్రిలేని మనవరాలికి ఆస్తి హక్కు ఇవ్వబడుతుంది. అంటే వారి తండ్రి బ్రతికి ఉన్న పక్షంలో వారి తాతగారి ఆస్తి నుండి వారికి ఎంత భాగం లభించి

ఉండేదో ఆ మేరకు వారికి వాటా లభిస్తుందన్న మాట. ఈ 'సంస్కరణ'లపై షరీఅత్ దృక్పథంతో కామెంట్ చేయవచ్చు. అంతేగాని పాకిస్తాన్‌లో ముస్లిమ్ పర్సనల్ లా మటుమాయమై పోయి దానిస్థానే ఏదో ముస్లిమేతర కోడ్ వేళ్ళూనుకోవటమో, ముస్లిమ్ పర్సనల్ లాలో పెద్ద ఎత్తున మార్పులు జరగటమో ఎంత మాత్రం జరగలేదని గ్రహించాలి.

ఈ పాటి మార్పును సయితం పాకిస్తాన్ ఉలమాలు తీవ్రంగా ఖండించారన్న సంగతి మరువరానిది. అక్కడి సామాన్య ప్రజలు కూడా ఈ మార్పుపై భారీఎత్తున నిరసన ప్రదర్శనలు జరిపారు. అయితే అక్కడి నిరంకుశ నియంతృత్వ ప్రభుత్వం ప్రజాభిప్రాయానికి విలువనివ్వకుండా తన పనిని తాను చేసుకు పోయింది. ఒకానొక నియంతృత్వ ప్రభుత్వం తీసుకున్న చర్య (ప్రపంచంలోనే అతి పెద్ద) ప్రజాస్వామిక దేశమైన ఇండియాకు ఎలా ఆదర్శప్రాయం కాగలదు ?

విస్మరించరాని ఇంకొక విషయం ఏమిటంటే పాకిస్తాన్ ప్రభుత్వం ముస్లిముల వ్యక్తిగత చట్టంలో మాత్రమే ఈ సంస్కరణలు తీసుకువచ్చింది. అక్కడ ముస్లిములు మెజారిటీ వర్గంగా ఉన్నారు. కాని పాకిస్తాన్ ప్రభుత్వం అక్కడి మైనారిటీల వ్యక్తిగత చట్టం జోలికిపోవటంగాని చేసిందా ? లేదు. మరి అలాంటప్పుడు పాకిస్తాన్ యందలి ముస్లిమ్ పర్సనల్ లాలో చేయబడిన సంస్కరణలను ఆధారంగా తీసుకుని భారత దేశంలో మైనారిటీలుగా ఉన్న ముస్లిముల వ్యక్తిగత చట్టంలో మార్పు జరిగితీరాలనటం ఎంతవరకు న్యాయసమ్మతం !

# కామన్ సివిల్ కోడ్ రూపురేఖలు

యూనిఫాం సివిల్ కోడ్‌ను చేయటంలో ప్రభుత్వం సఫలీకృతమయ్యిందంటే, దాని పరిధి ఒకటికన్నా ఎక్కువ వివాహాలు చేసుకోరాదన్న ఆంక్ష వరకే పరిమితం కాదు. పైగా అది వివాహం. తలాక్, ఖులా, నికాహ్ రద్దు, వారసత్వం ఇత్యాది వ్యవహారాలన్నింటినీ తన పరిధిలోకి తీసేసుకుంటుంది. ఈ సందర్భంగా రూపొందించబడే స్మృతి (Code) ముస్లిమనీ, హిందువనీ, క్రైస్తవుడనీ, పారసీకుడనీ విచక్షణ చూపకుండా అందరికీ వర్తిస్తుంది. ఈ శాసన నిర్మాణం అన్ని రకాల మత బంధనాల నుండి స్వతంత్రంగా ఉంటుంది. ఇటువంటి చట్టం ఇస్లామ్ ధర్మశాస్త్రవేత్తలు జరిపే 'ఇజ్తెహాదాత్' (షరీఅత్ పరమార్గాల అన్వయింపులు)తో మాత్రమే కాదు, ముస్లిమ్ సమాజం సాధించే ఏకాభిప్రాయం, ఖుర్‌ఆన్ హదీసుల స్పష్టమయిన ఆదేశాలకు కూడా విరుద్ధమవుతుంది.

యూనిఫాం సివిల్ కోడ్ ఎటువంటి అంశములతో కూడుకుని ఉంటుందనేదానికి సమాధానం దాన్ని నిర్మించే దురదృష్టకర పరిస్థితులు దాపురించినపుడే లభిస్తుంది. అయితే మొత్తమ్మీద ఆ కోడ్ ఏ ఏ పునాదులపై రూపుదిద్దుకుంటుందనే విషయం అనూహ్యం ఏమీ కాదు. ఎందుకంటే అది మెజారిటీ ఓటు ఆధారంగా రూపొందుతుంది. పార్లమెంటులో చట్టాల ఆమోదానికి ఏ పద్ధతి అవలంబిస్తారో అదే ఇక్కడా అవలంబించ బడుతుంది. ఆ విధంగా క్రియాత్మకంగా మెజారిటీ వర్గం మాటే నెగ్గుతుంది. అధిక సంఖ్యాక వర్గం ఆలోచనాసరళి తెలియనిదేమీ కాదు. వారి ఆలోచనలు పగ్గం త్రెంచుకుని పాశ్చాత్య

నాగరికత వైపుకు పరుగెడుతూ ఉంటాయి. ఉదాహరణకు బహు భార్యాత్వాన్ని నిషేధించాలి. విడాకులిచ్చే అధికారం మగవాడికి గాకుండా న్యాయస్థానాలకు ఉండాలి. ఆస్తిపాస్తుల్లో కొడుకులతో పాటు కుమార్తెలకు కూడా సమానంగా భాగం లభించాలి. వగైరా వగైరా....

అధిక సంఖ్యాక వర్గం గత కొన్ని సంవత్సరాల క్రితం హిందూ కోడ్ బిల్‌ను ఆమోదించిన సంగతి అందరికీ తెలిసిందే. అవి హిందూ మ్యారేజ్ ఆక్ట్ (Hindu Marriage Act), హిందూ సక్సెషన్ ఆక్ట్ (Hindu Succession Act) రూపంలో అమల్లో ఉంది. ఈ చట్టాల ద్వారా అధిక సంఖ్యాక వర్గం మనస్తత్వం విస్పష్టమైపోయింది. కాబట్టి హిందూ కోడ్ అద్దంలో యూనిఫాం సివిల్ కోడ్ బింబాన్ని చూడవచ్చని ఎవరయినా అంటే అది పొరబాటు కాబోదు. ఇండియన్ సివిల్ కోడ్ అనే అంశంపై ప్రొ॥ జె డంకన్ (ప్రొఫెసర్, ఓరియంటల్ లాస్, లండన్ యూనివర్సిటీ) వెల్లడించిన అభిప్రాయం ద్వారా కూడా ఇది నిజమని నిర్ధారణ అవుతుంది. ఆయన ఇలా వ్రాశారు :

> The Civil Code promissed In Article 44 of the Constitution is like the Hindu Code of which we have spoken before, a misnomer, but a convenient one. (Religion Law and the State in India by J. Duncan. P. 546)

"ఏ సివిల్ కోడ్ గురించయితే రాజ్యాంగంలోని 44వ అధికరణలో వాగ్దానం చేయబడిందో అది హిందూ కోడ్ లాంటిది. దాన్ని గురించి మేము ఇంతకుముందే చర్చించాము. ఒకవేళ (హిందూ కోడ్) పేరు దృష్ట్యా అపోహను

సృష్టిస్తున్నప్పటికీ సముచితమైన (సివిల్ కోడ్) మాత్రం అదే "

అధిక సంఖ్యాక వర్గం మనస్తత్వం ఇలాంటిదయినప్పుడు యూనిఫాం సివిల్ కోడ్‌ను రూపొందించే సమయంలో వారు తద్భిన్నంగా వ్యవహరిస్తారని ఎలా ఆశించగలం? వీటి నిమ్న విషయాల్లో, వివరాలలో కొంత మార్పు కానరావచ్చునేమోగాని సూత్రప్రాయంగా నిర్ణయాలు మాత్రం హిందూ కోడ్ రూపంలోనే ఉంటాయి. మరో మాటలో చెప్పాలంటే హిందూ కోడ్‌కే స్వల్పమైన సవరణలతో ఉమ్మడి సివిల్ కోడ్ (Uniform Civil Code) స్థాయి కల్పించటం జరుగుతుంది. కనుక ప్రస్తుత హిందూ కోడ్ స్వరూప స్వభావాలను ఆకళింపు చేసుకుని అది ముస్లిమ్ పర్సనల్ లాకు ఎంత భిన్నంగా, మరెంత వ్యాఘాతంగా ఉందో పోల్చి చూసుకోవటం ఎంతయినా అవసరం.

ప్రజా బాహుళ్యంలో హిందూ కోడ్‌గా వ్యవహరించబడుతున్న హిందూ వివాహ చట్టం (Hindu Marriage Act - 1955) తత్వాన్నిబట్టి ఒక భార్య ఉండగా మరో వివాహం చేసుకోవడానికి వీలుండదు * దీనికి భిన్నంగా ఇస్లామ్ న్యాయం చేకూర్చ

---

* Any Marriage between two Hindus solemnized after commencement of this Act is void, if at the date of such marriage either Party had a husband or wife living ; and the provisions of Section 494 and 495 of the Indian Penal Code shall apply accordingly (Section - 17).

రెండవ వివాహం గనక చేసుకున్నట్లయితే ఇండియన్ పీనల్ కోడ్ ప్రకారం ఏడేళ్ళ జైలు శిక్ష పడుతుందని చెప్పబడిందన్నది గుర్తుంచుకోవాలి.

పరిమితుకు కట్టుబడి నలుగురు భార్యలను చేసుకునేందుకు అనుమతి-నిచ్చింది. ఈ అనుమతి కూడా అసంఖ్యాకమైన ప్రయోజనాల, పరమార్థాల దృష్ట్యా ఇవ్వబడింది. కొన్ని పరిస్థితుల్లో రెండవ వివాహం అనివార్యమయిపోతుంది. ఎవరి భార్య అయినా శాశ్వత రోగగ్రస్తురాలయితే లేక వంధ్యత్వం గలదయితే అటు వంటి పరిస్థితుల్లో మగాడి ముందు రెండు కర్తవ్యాలుంటాయి. ఒకటి : అతనామెకు విడాకులిచ్చి మరో ఆమెను మనువాడటం. రెండవది : ఆమెను తన అర్థాంగిగానే ఉంచి ఇంకొక వివాహం చేసుకోవటం. మొదటి చర్యకన్నా రెండవది మెరుగైనదనటంలో సందేహం లేదు. కాని బహు భార్యాత్వంపై నిషేధం ఉంటే ప్రజలు గత్యంతరంలేక మొదటి విధానాన్నే అవలంబిస్తారు. దానివల్ల దెబ్బతినేది స్త్రీ ప్రయోజనాలేనన్నది నిర్వివాదాంశం.

వితంతు సమస్యల దృష్ట్యా కూడా బహు భార్యాత్వానికి అనుమతించటం అవసరమే. అన్నిటికన్నా ముఖ్యమైన విషయం ఏమిటంటే ఇస్లామ్ యావత్తు సచ్ఛీలత, సదాచార ప్రధానమైన ధర్మం. అది తన అనుయాయుల్లో సౌశీల్యాన్ని, పరిశుద్ధతను పెంపొందించగోర్తుంది. అందుకే అది పురుషుడిని అధర్మమైన, అక్రమమైన మార్గాల నుండి కాపాడే నిమిత్తం బహు భార్యాత్వపు ద్వారాలను తెరచి ఉంచింది. కాబట్టి ధర్మసమ్మతమయిన ఈ ద్వారాలనే గనక మూసివేస్తే అది పరోక్షంగా అక్రమమైన, నీతి బాహ్యమయిన మార్గాలను తెరచినట్లే అవుతుంది. పాశ్చాత్య సమాజం చేజేతులా ఈ పరిస్థితినే కొనితెచ్చుకుంది. అక్కడ చట్టమయితే ఒకే భార్యను కలిగి ఉండాలని పట్టుబడుతుంది. కాని అక్రమంగా ఎందరు స్త్రీలతో సంబంధాలు పెంచుకున్నా

తప్పులేదు. దాన్ని గురించి అడిగేవాడు కూడా ఉండడు. పైపెచ్చు పాశ్చాత్య సంస్కృతి లలిత కళలని, నాట్యం, సంగీతం లాంటి ఇతర సాధనాల ద్వారా లైంగిక విశృంఖలత్వాన్ని పెంచి పోషిస్తున్నది. ఒకవంక మగవాడు ఒక్క భార్యతో సరిపుచ్చుకోలేని భావోద్రేకాల వాతావరణాన్ని సృష్టిస్తూనే పాశ్చాత్య సమాజం మరోవంక చట్టపరంగా ఏకపత్నీ వ్రతానికి కట్టుబడమని ఆదేశిస్తోంది ఈ పాశ్చాత్య సంస్కృతీ నాగరికతల ఈ ధ్వజవాహకులకు బహు భార్యాత్వపు ధర్మబద్ధమయిన మార్గాన్ని రద్దుపరిచే అర్హత ఎక్కడిది?

విడాకుల విషయంలో కూడా హిందూ కోడ్ ఇస్లామ్ విడాకుల చట్టానికి పూర్తి విరుద్ధంగానూ, ఆధునిక నాగరికతతో సామరస్యం చెందేదిగానూ ఉంది. అది విడాకుల అధికారాన్ని భర్తకుగాక కోర్టుకు అప్పజెప్పింది. ఒకవేళ ఎవరయినా తన భార్యకు విడాకలు ఇవ్వదలచినా లేదా భార్య భర్త నుండి విడాకులు పొందదలచినా ఆ భర్త లేక భార్య కోర్టుకు అభ్యర్థించుకోవలసి ఉంటుంది. అప్పుడు కోర్టు కోడ్‌లో పేర్కొనబడిన కారణాలలోని ఏదేని ఒక కారణం ఆధారంగా విడాకుల ఉత్తర్వు (Decree) ఇస్తే వారిరువురి వేర్పాటు జరిగిపోతుంది. అయితే పెళ్ళయిన మూడేళ్ళలోపు వచ్చిన దరఖాస్తులను కోర్టు పరిశీలించదు.

కాగా, ఇస్లామ్ పురుషునికి 'తలాక్' హక్కును, స్త్రీకి 'ఖులా' హక్కును ఇచ్చింది. హిందూ కోడ్ మాత్రం ఈ రెంటినీ కాదంటుంది. అంటే పురుషునికి విడాకులు ఇచ్చే అధికారంగాని, స్త్రీకి విడాకులు కోరే హక్కుగాని లేదు. పైగా

వారిరువురూ తమ వ్యవహారాన్ని (కోర్టు) రచ్చకెక్కించాలి. అందులో ఉన్న కీడు అందరికీ విదితమే. భార్యాభర్తలు తమ సంసార గొడవలను మాటిమాటికీ కోర్టుకెక్కించి కోర్టు చుట్టూ తిరగటం సముచితం కాదు. కోర్టులో చట్టబద్ధంగా ఆరోపణను నిరూపించటం కూడా అంత సులువయిన విషయం కాదు. ఇటువంటి చట్టపరమయిన చిక్కుల్ని సృష్టించటం మూలంగా జరిగేదేమిటి ? భర్త ఇలాంటి విడాకుల పద్మవ్యూహంలో అడుగుపెట్టే బదులు భార్యను త్రిశంకు స్థితిలో పడవేస్తాడు, ఆమె జీవితం దుర్భరం చేస్తాడు, లేదా ఆమెపై తప్పుడు ఆరోపణలు, అసహ్యామయిన నిందలు మోపుతూ కోర్టుకు ఈడుస్తాడు — కోర్టు ద్వారా తీర్పు తన పక్షాన రాబట్టేందుకు. మరోవైపు భార్య గనక తన భర్త బారి నుండి విముక్తం కావలిస్తే, 'ఖులా' వంటి సరళ మార్గాన్ని అవలంబించజాలదు. దానికి బదులు ఆమె కోర్టుల చుట్టూ తిరగవలసి ఉంటుంది. అంతచేసీ తీర్పు ఆమె పక్షాన రాకపోతే ఆమె ఏ ముఖం పెట్టుకుని ఆ భర్తతో వేగగలుగుతుంది ? ఏ భర్తకు వ్యతిరేకంగానయితే ఆమె వ్యవహారాన్ని కోర్టుకు తీసుకుపోయిందో ఆ భర్తతోనే ఎలాంటి అరమరికలు, ఆటుపోట్లు లేకుండా కాపురం చేయగలుగుతుందా ? దూరదృష్టితో ఆలోచించిన మీదట అవగతమయ్యేదేమిటంటే విడాకుల అధికారాన్ని భర్త నుండి లాక్కొని న్యాయస్థానానికి అప్పగించటం వల్ల స్త్రీకి మేలుకన్నా కీడే ఎక్కువ.

ఈ సందర్భంగా ఇంకో ప్రశ్న కూడా ఉత్పన్నమవుతుంది — విడాకులిచ్చే అధికారం మగవాని నుంచి లాక్కోగా, ఎవరయినా ఒక ముస్లిమ్ షరీఅత్ పద్ధతి ప్రకారం తన భార్యకు విడాకు

లిచ్చేస్తే అప్పుడు జరిగేదేమిటి ? చట్టమయితే అటువంటి విడాకులను ఒప్పుకోదు. కనుక అతను విడాకులు ఇచ్చి కూడా చట్ట నిబంధన ప్రకారం ఆమెను భార్యగానే చూడవలసి ఉంటుంది. వాస్తవానికి ఇప్పుడామె షరీఅత్ ప్రకారం అతని భార్య కాదు. అలాగే ఒక వ్యక్తి తన భార్య అక్రమ సంబంధాలు పెట్టుకున్నట్లు గమనించినా కోర్టులో దానికి తగు ఆధారాలను చూపలేకపోయినప్పుడు, విడాకులిచ్చే అధికారం కూడా అతనికి లేకుండాపోతే అట్టి పరిస్థితిలోనూ అతను ఆమెను తన భార్యగానే పరిగణించవలసి ఉంటుంది. నైతికత, సౌశీల్యం, పరిశుద్ధతలనే జీవిత మూలధనంగా భావించే ఒక ముస్లిమ్‌కు ఇది ఎంత ఆందోళన కలిగించే విషయమో ఊహించటం కష్టం కాదు.

మనోవర్తి (భరణం) విషయంలో హిందూ కోడ్ ఏమంటున్నదంటే, భార్యాభర్తల మధ్య వేర్పాటు జరుగుతున్న సమయంలో ఆయా స్త్రీ పురుషుల ఆర్థిక స్థితిగతులను దృష్టిలో పెట్టుకుని న్యాయస్థానం మనోవర్తిని నిర్ణయిస్తుంది, ఆ మనోవర్తి బాధ్యతను కేసు స్వరూపాన్నిబట్టి స్త్రీ పైననో, పురుషుని పైననో మోపుతుంది. దరఖాస్తుదారు పునర్వివాహం చేసుకునే వరకు, లేక ఇద్దరిలో ఎవరో ఒకరు మరణించే వరకూ మనోవర్తి ఇవ్వవలసి ఉంటుంది. అంటే పురుషునిపై ఎలాగయితే మనోవర్తి చెల్లించే భారం ఉందో అదే విధంగా స్త్రీపై కూడా తన మాజీ భర్తకు మనోవర్తి చెల్లించే బాధ్యత ఉంటుంది. ఇదీ 'న్యాయం,' 'సమానత్వం' కోరుతున్నది! ఇద్దరి మధ్య దాంపత్య సంబంధాలు తెగిపోయినా మనోవర్తి బాధ్యత మటుకు మిగిలే ఉంటుంది. ఇదంతా విడాకుల వ్యవహారాన్ని మరింత క్లిష్టతరం చేయడం కాక

పోతే మరేమిటి? దీనివల్ల కలిగే పరిణామాన్ని గురించి ఎవరూ ఆలోచించటంలేదు. భార్యతో కాపురం చేయడానికి ఇష్టంలేని భర్త ఆమెను వదలటంలో అసాధారణమయిన చిక్కులు, ప్రతిబంధకాలు ఎదుర్కొనడంచేత ఆమెను రకరకాలుగా బాధించటానికి శతవిధాలా యత్నిస్తాడు.

వారసత్వం విషయంలో హిందూ సక్సెషన్ ఆక్ట్ (Hindu Succession Act - 1956) అమల్లో ఉంది. దీన్ని కూడా సాధారణంగా హిందూ కోడ్‌గానే వ్యవహరిస్తారు. దీన్ని కూడా హిందూ ధర్మశాస్త్రంపైగాక ఆధునిక నాగరికతా పునాదులపైనే నిర్మించడం జరిగింది. వారసత్వపు పంపకం విషయమై ఈ కోడ్‌లో రూపొందించబడిన నియమాల సారాంశం ఇది :

(1) వారసత్వం అందరికంటే ముందు ప్రథమ శ్రేణి వారసుల్లో పంచబడుతుంది. ప్రథమ శ్రేణి వారసుల్లో కొడుకు, కూతురు వితంతువు. తల్లి, మరియు తాత బ్రతికుండగానే తండ్రి చనిపోయిన మనవడు, మనవరాలు ఉన్నారు. వీరిలో ప్రతి ఒక్కరికీ సమానమయిన వాటా లభిస్తుంది. అయితే మనవడు మనవరాళ్ళకు కలిపి ఒక వాటా మాత్రమే లభిస్తుంది.

(2) ప్రథమ శ్రేణి వారసులు గనక లేని పక్షంలో వారసత్వం ద్వితీయ శ్రేణి వారసుల్లో పంపకమవుతుంది. ఇందులో మళ్ళీ స్థాయి విభజన ఉంది. ఈ పంపకంలో ప్రథమ స్థాయికి, ద్వితీయ స్థాయిపై. ద్వితీయ స్థాయికి, తృతీయ స్థాయిపై (అలాగే చివరి వరకు) ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. ప్రథమ స్థాయిలో తండ్రి మాత్రమే వారసుడు. ద్వితీయ స్థాయిలో (కొడుకుకు కూతురు) మనుమరాలి కొడుకూ కూతుళ్ళు, సోదరీ సోదరులు

ఉంటారు. తృతీయ స్థాయిలో కూతురి కొడుకు (మనుమడు) యొక్క సంతానం, కూతురి కూతురు (మనుమరాలు) యొక్క సంతానం ఉంటారు. నాల్గవ స్థాయిలోకి సోదరుని సంతానం, సోదరి సంతానం వస్తారు. ఐదవ స్థాయిలో తాత, తాతమ్మ. ఆరవ స్థాయిలో తండ్రి వదలిన వితంతువు, సోదరుడు వదలిన వితంతువు ఏడవ స్థాయిలో పినతండ్రి మరియు మేనత్త ఉంటారు.

(3) చనిపోయినది స్త్రీ అయినట్లయితే ఆమె ఆస్తి మొదట కొడుకులు కుమార్తెలు (నాయనమ్మ బ్రతికి ఉండగానే తండ్రి చనిపోయిన మనుమలు మనుమరాళ్ళు కూడా ఇందులోకి వచ్చేస్తారు. వారికి లభించే మొత్తం వాటా వారి తండ్రి వాటాకు సమానంగా ఉంటుంది) మరియు భర్త మధ్య పంపిణీ అవుతుంది. రెండో స్థాయిలో భర్త తరపు వారసులు వస్తారు. మూడో స్థాయిలో తల్లిదండ్రులు, నాల్గవ స్థాయిలో తండ్రి తరపు వారసులు, చివరన తల్లి తరపు వారసుల మధ్య పంపిణీ జరుగుతుంది.

వారసత్వపు ఈ చట్టాన్నే కాస్త మార్చి యూనిఫాం సివిల్ కోడ్ రూపమివ్వడం జరగవచ్చు. ఇది ఇస్లామ్ వారసత్వ చట్టానికి మౌలికంగా భిన్నమయింది. ఇస్లామ్ కూతురి వాటాను కొడుకు వాటాలో సగంగా ఖరారు చేసింది. దాని కారణాలను మేమింతకుముందే విశదీకరించి ఉన్నాము. కాని ఆధునిక నాగరికత యదార్థాలను ఉపేక్షించి గుడ్డిగా సమానతా సూత్రాన్ని నెలకొల్పింది. దాని ప్రకారం స్త్రీ పురుషులిద్దరికీ ఒకే స్థాయి కల్పించడం జరిగింది. ఈ సంస్కృతి ప్రభావంతోనే హిందూ

కోడ్‌లో కొడుకూ కూతుళ్ళకు సమాన భాగాలు నిర్ధారించటం జరిగింది. లేకపోతే హిందువుల్లోనయితే కుమార్తెకు ఆస్తిని పంచి ఇచ్చే సంప్రదాయం ఎక్కడిది? కూతురికి ఆస్తి హక్కు లేదనటం ఒక అతివాదమయితే, సమానంగా పంచి ఇవ్వాలనటం మరో అతివాదం. అయితే ఇస్లామ్ ఈ రెండు అతివాదాలకు నడుమ మధ్యేమార్గాన్ని ప్రతిపాదించింది.

ఇస్లామ్ భార్య వాటాను— ఆమెకు సంతానంలేని పక్షంలో నాల్గవ (1/4) వంతుగా, సంతానం ఉన్న పక్షంలో ఎనిమిదవ (1/8) వంతుగా నిర్ణయించింది. తల్లి భాగం సంతానం ఉన్న పక్షంలో ఆరవ (1/6) వంతుగా, సంతానంలేని పరిస్థితిలో మూడవ (1/3) వంతుగా నిర్ధారించింది. హిందూ కోడ్‌లోనైతే తల్లి, వితంతువు, కొడుకు, కూతురు— అందరి భాగం సమానమే.

ఇస్లామ్ తండ్రి వాటాను సంతానం ఉన్న పక్షంలో 1/6వ వంతుగాను, సంతానంలేని పక్షంలో భార్యకు, తల్లికి ఇవ్వగా మిగిలిన సంపదనంతటికీ వారసునిగాను నిర్ణయించింది. ఒకవేళ వారిలో (అంటే తల్లి మరియు భార్య) ఎవరూ బ్రతికిలేని పక్షంలో యావదాస్తికీ అతను వారసుడవుతాడు. కాని హిందూ కోడ్‌లో తండ్రిని ద్వితీయ శ్రేణి వారసుల్లో ఉంచటం జరిగింది. అంటే మొదటి శ్రేణి వారసులు— కొడుకు, కూతురు, భార్య, తల్లి— ఉండగా తండ్రికి ప్రాప్తించేదేమీ ఉండదు. ఆధునిక న్యాయ దృష్టిలో తల్లి వాటానయితే తప్పనిసరిగా లభించాలి, తండ్రికి మటుకు అవసరమే లేదు!

దగ్గరి బంధువులుండగా దూరపు బంధువుల కోసం ఇస్లాం భాగం నిర్ణయించలేదు. అయితే ఇలాంటివారి కొరకు ఆస్తిలో

మూడింట ఒక వంతు వరకు వీలునామా వ్రాసి ఇచ్చేందుకు అవకాశం కల్పించింది. అనాధ అయిపోయిన మనుమని సమస్యను పరిష్కరించడానికి ఈ వీలు ఎంతగానో తోడ్పడుతుంది. కాని హిందూ కోడ్‌లోని విధానం ఇందుకు భిన్నంగా ఉంది. అందులో సమీప బంధువులు (ఆత్మీయులు) ఉండగా ఇతరత్రా బంధువులకు కూడా భాగం ఖరారు చేయబడింది.

ప్రస్తుత హిందూ కోడ్ నిర్మాణంలో ఇస్లామ్ ప్రతిపాదించే వారసత్వపు చట్టం ద్వారా ఎంతోకొంత ప్రయోజనం పొందినప్పటికీ (ఉదాహరణకు, కూతురుకు ఆస్తిలో భాగం ఇవ్వటం వగైరా) ఇది ఇస్లామ్ వారసత్వపు నిబంధనావళికి మౌలికంగా భిన్నమయింది. కాబట్టి ఇది గనక యూనిఫాం సివిల్ కోడ్ స్థాయిని సంతరించుకుందంటే ముస్లింలు లెక్కలేనన్ని ఇక్కట్లకు లోనుకావలసి వస్తుంది. ఒక బంధువుకు షరీఅత్ నిర్ణయించిన వాటాకన్నా ఎక్కువ లభించగా మరొకనికి తక్కువ లభిస్తుంది. ఇంకొకరికి అస్సలేమీ ప్రాప్తించదు. ఇది నిస్సందేహంగా అన్యాయం, అక్రమం. ఎవరికయితే షరీఅత్ ఖరారు చేసిన దానికన్నా ఎక్కువ భాగం లభిస్తే అది అతనికి ధర్మసమ్మతం కాదు. ఎందుకంటే అతనికి ఆ సొమ్ము మరొకని హక్కును కాజెయ్యటం వల్ల ఇతనికి ప్రాప్తించింది! అంటే యూనిఫాం సివిల్ కోడ్‌ని సమర్థించే ముస్లిములు హరామ్ (ధర్మసమ్మతంకాని) సొమ్ము తినాలని కోరుకుంటున్నారన్న మాట!

## ఇండియన్ సక్సెషన్ చట్టం

యూనిఫాం సివిల్ కోడ్ స్వరూప స్వభావాలను విశదపరచే ఉద్దేశ్యంతో వెనుకటి పుటల్లో హిందూ కోడ్ దృష్టాంతాలను

ఇవ్వటం జరిగింది. యూనిఫాం సివిల్ కోడ్‌ను హిందూ కోడ్‌గా ఊహించడం సమంజసంకాదని ఎవరయినా ఆక్షేపించవచ్చు. దాన్ని పక్కకు పెట్టి ఇండియన్ సక్సెషన్ యాక్ట్ (Indian Succession Act 1925), స్పెషల్ మ్యారేజ్ యాక్ట్ (The special Marriage Act 1954)ల అద్దంలోనూ యూనిఫాం సివిల్ కోడ్ మోమును చూసుకోవచ్చు.

ఇండియన్ సక్సెషన్ చట్టం ముస్లిములు, హిందువులు, బౌద్ధులు, జైనులు, శిక్కులను మినహాయించి మిగిలిన పౌరులందరికీ వర్తిస్తుంది. ఈ చట్టంలో వివరించబడిన వారసత్వపు నియమాల సారాంశం ఇలా ఉంది—

(1) వీలునామా వ్రాయడంపై ఎలాంటి నిర్బంధం లేదు. ఏ వ్యక్తయినా తన ఆస్తి అంతటికీ వీలు వ్రాసుకోగలడు. (Section - 59)

(2) మృతుడు గనక వీలు వ్రాయకుండా ఉంటే, అతని వెనుకనున్నవారిలో వితంతువు ఉంటే వితంతువుకు 1/3వ వంతు, సంతానానికి 2/3వ వంతు ఆస్తి లభిస్తుంది. (Section 33 to 43)

(3) ఒకవేళ మృతునికి సంతానం లేకపోయినట్లయితే వితంతువుకు 1/2వ వంతు దక్కుతుంది. మిగిలిన భాగం ఇతర బంధువులకు చెందుతుంది.

(4) ఒకవేళ అతని వితంతువు (భార్య) కూడా బ్రతికి లేకుంటే యావదాస్తి అతని పిల్లలలో విభజించబడుతుంది. పిల్లలు లేకపోయినట్లయితే ఇతర బంధువులకు చెందుతుంది. ఇతర బంధువులు కూడా లేని పక్షంలో ఆస్తి ప్రభుత్వపరమవుతుంది.

(5) భర్త ఆస్తిలో వితంతువుకు ఎంత భాగం లభిస్తుందో (మృతురాలు భార్య అయినప్పుడు) అంతే భాగం భర్తకూ లభిస్తుంది.

(6) సంతానం మధ్య ఆస్తి సమభాగంలో పంపకమవుతుంది. అంటే కొడుకులకు, కూతుళ్ళకు వాటాలు సమానంగా లభిస్తాయి.

(7) ఒకవేళ సంతానంలో ఎవరైనా మరణించి ఉంటే వారి వాటాను తీసి మనుమలు మనుమరాళ్ళకు ఇవ్వటం జరుగుతుంది.

(8) ఒకవేళ మృతునికి సంతానంలేనట్లయితే వితంతువు వాటా ఇచ్చివేయగా మిగిలిన ఆస్తి క్రింది విధంగా పంచిపెట్టడం జరుగుతుంది :

(అ) మృతుని తండ్రి గనక బ్రతికి ఉంటే అతను ఆ మొత్తం ఆస్తికి వారసుడవుతాడు.

(ఆ) తండ్రి బ్రతికి ఉండకపోతే తల్లి, సోదరుడు, సోదరీల మధ్య ఆస్తి సమానంగా పంపిణీ అవుతుంది.

ఈ చట్టం కూడా ఇస్లామ్ వారసత్వపు నియమాలకు మౌలికంగా భిన్నమయినదే. ఇస్లామ్‌లో వీలునామా వ్రాసే హక్కు ఆస్తిలోని మూడింట ఒక వంతుకు మాత్రమే ఉండగా ఈ చట్టం యావదాస్తికి వీలు వ్రాసుకునేందుకు అధికారం ఇచ్చింది. ఇస్లామ్, కొడుకుకు లభించే భాగంలో సగభాగం కుమార్తెకు ఇవ్వగా ఈ చట్టం కొడుకూ కూతుళ్ళకు సమాన భాగాలు లభింప

జేస్తుంది. మృతునికి సంతానం ఉన్న పక్షంలో భార్యకు ఆస్తిలో 1/8వ వంతు లభిస్తుందని, సంతానం లేనట్లయితే 1/4వ వంతు లభిస్తుందని ఇస్లామ్ నిర్ణయించింది. కాగా; ఈ చట్టం భార్యా వాటాను 1/3గా ఖరారు చేసింది. సంతానం లేకపోతే 1/2 భాగం ఉంటుందని చెప్పింది. భర్తకు కూడా ఇదే నిష్పత్తిలో సంతానం ఉన్న పక్షంలో 1/3వ భాగం, లేని పక్షంలో 1/2 అంటుంది. కాని ఇస్లామ్ వారసత్వపు నియమాల ప్రకారం, భర్త భాగం సంతానం లేని స్థితిలో 1/2వ వంతుగానూ, సంతాన మున్నట్లయితే 1/4గానూ నిర్ధారించబడింది.

సంతానముండగా తల్లిదండ్రుల హక్కును కూడా ఇస్లామ్ నిర్ణయించింది. కాని ఈ చట్టం ప్రకారం సంతానముండగా వారసత్వంలో తల్లిదండ్రులకు హక్కు ఉండదు.

ఈ ఉదాహరణల ద్వారా ప్రస్ఫుటమయ్యేదేమిటంటే, యూనిఫాం సివిల్ కోడ్ స్థానంలో ఇండియన్ సక్సెషన్ యాక్ట్–1925ను తెచ్చిపెట్టినప్పటికీ ముస్లిముల వారసత్వపు వ్యవస్థ అంతా తలక్రిందులవక తప్పదు. మౌలికంగా షరీఅత్‌కు విరుద్ధ మయిన చట్టం ఒకటి,— న్యాయానికీ, ధర్మానికీ కూడా వ్యతిరేక మయినది— వారిపై రుద్దినట్లవుతుంది.

# స్పెషల్ మ్యారేజ్ ఆక్ట్

స్పెషల్ మ్యారేజ్ (1954) చట్టానుసారం ఏ పురుషుడు మరియు స్త్రీ అయినా వివాహమాడవచ్చు. అయితే వారుభ యులూ మ్యారేజ్ ఆఫీసరు సమక్షంలో ఈ చట్టానికి కట్టుబడి.

వివాహం చేసుకుంటున్నామని నియమానుసారం వ్రాతపూర్వకంగా ప్రకటించాలి.

ఈ చట్టంలోని షరీఅత్ శాసనాలకు విరుద్ధమయిన కొన్ని అంశాలను యిక్కడ పొందుపరుస్తున్నాము—

(1) ఈ చట్టానుసారం ఒక భార్య ఉండగా మరో పెళ్ళి చేసుకోవటం నేరం. ఈ నేరానికి పాల్పడినందుకు ఏడేళ్ళ కారాగార శిక్ష పడుతుంది.

(2) పినతండ్రి కుమారుడు, మేనత్త కొడుకు, చిన్నమ్మ (తల్లి సోదరి) కొడుకు, మామ కొడుకుతో మనువాడకూడదు.

(3) విడాకులిచ్చే అధికారం కోర్టుకు మాత్రమే ఉంటుంది. భార్యాభర్తల్లోని ఏ ఒక్కరయినా విడిపోవాలని అనుకుంటే సదరు చట్టంలో ప్రస్తావించబడిన కారణాలలోని ఏ కారణాన్నయినా చూపుతూ విడాకుల కోసం దరఖాస్తు పెట్టుకోవలసి ఉంటుంది. కోర్టు, వాంగ్మూలం పట్ల సంతృప్తిచెందిన పక్షంలో వేర్పాటుకు అంగీకరిస్తుంది.

(4) ఒకవేళ భార్యాభర్తలిరువురూ విడిపోవాలనుకున్నప్పటికీన్నీ విడాకుల కోసం వారు కోర్టును ఆశ్రయించక తప్పదు.

(5) వివాహమై మూడేళ్ళు గడవక పూర్వం విడాకుల కొరకు ఎలాంటి పిటీషన్ పెట్టుకోవటానికి వీల్లేదు.

(6) కోర్టు ద్వారా విడాకులు పొందిన పక్షంలో— అలా విడాకులు పొందినవారెవరూ ఒక సంవత్సరందాకా మళ్ళీ పెళ్ళి చేసుకోజాలరు.

(7) కోర్టు ద్వారా విడాకులు పొందిన పక్షంలో— విడాకులు పొందిన మహిళ పునర్వివాహం చేసుకునే వరకూ లేదా ఆమె చనిపోయే వరకూ (మాజీ) భర్త మనోవర్తి ఇస్తూనే ఉండాలి

(8) ఈ చట్టానికి కట్టుబడి వివాహం చేసుకున్న వ్యక్తి వారసత్వపు సంపత్తి విషయంలో అతని ఆస్తిపాస్తులపై "ఇండియన్ సక్సెషన్ యాక్ట్ : 1925" వర్తిస్తుంది.

## ముస్లిముల అభిమతం

హిందూ కోడ్ ఇండియన్ సక్సెషన్ యాక్ట్ స్పెషల్ మ్యారేజ్ యాక్ట్ల ఈ స్థూల పరిశీలన ద్వారా కొన్ని విషయాలు వెల్లడవుతున్నాయి. ● ఈ మూడు చట్టాలు ఏ ప్రాతిపదిక నుండి పుట్టాయో దాన్నుండే యూనిఫాం సివిల్ కోడ్ కూడా పుడుతుంది. ● ఏ మేధ అయితే ఒకటికి మూడు శాసనావళులను రచించిందో అది ఎటువంటి తడబాటు లేకుండా యూనిఫాం సివిల్ కోడ్ పేరుతో నాల్గవ శాసనావళిని కూడా రచించవచ్చు. ● కుటుంబ నియమాల విషయంలో అధిక సంఖ్యాకుల ఆలోచనా ధోరణి ఆధునిక నాగరికత నుండి ఉనికిలోకి వచ్చిందే. ● ఇంతకు ముందు ప్రస్తావించిన మూడు చట్టాలలోనూ ఆధునిక భావాలు, సిద్ధాంతాలు, ధోరణులు తొంగిచూస్తున్నాయి. ● ఈ వాస్తవాలు మన ముందుండగా యూనిఫాం సివిల్ కోడ్ రూపురేఖల్ని ఊహించడం కష్టమేమీ కాదు. దీని స్వరూప స్వభావాలు సుస్పష్టమే. ప్రస్తావిత చట్టాలు మూడు [హిందూ కోడ్, సక్సెషన్ యాక్ట్, స్పెషల్ మ్యారేజ్ యాక్ట్] దీనికి అద్దంపడుతూనే ఉన్నాయి.

కాగా; ఇస్లామ్ అల్లాహ్ తరఫున అవతరింపజేయబడిన ధర్మం అని విశ్వసించే ఒక ముస్లిమ్, ముస్లిమ్ పర్సనల్ లా షరీఅత్‌లోని అత్యంత ముఖ్యమైన అంశమని నమ్మే ముస్లిమ్— ముస్లిమ్ పర్సనల్ లాను వ్యతిరేకించటం, యూనిఫారం సివిల్ కోడ్ కావాలని కోరుకోవటం సాధ్యమా? కేవలం నవ నాగరికతా ఉద్దేశ్యాల పరిపూర్తి కోసమని, ఖుర్‌ఆన్ హదీసులకు వ్యతిరేకంగా ముస్లిమ్ పర్సనల్ లాలో చేయబడే ఏ సవరణనూ అతను సమర్థించలేడు.

దైవకృప వల్ల ఈ విషయమై ముస్లిమ్ ప్రజాభిప్రాయం జాగృతమయింది. ముస్లిమ్ పర్సనల్ లాలో ఎలాంటి మార్పునూ అంగీకరించడానికి వారు సంసిద్ధంగా లేరు. ముస్లిమ్ మహిళలు షరీఅత్ చట్టాలతో విసిగి వేసారిపోయారని అందరినీ నమ్మించటానికి ముస్లిమ్ పర్సనల్ లా వ్యతిరేకులు ప్రయాసపడుతుండగా ఆ ముస్లిమ్ మహిళలే ముస్లిమ్ పర్సనల్ లా పరిరక్షణకై రంగంలోకి కదలివచ్చారు. వారు బొంబాయి, నాగపూరు, నాందేడ్, పర్భనీ, హైదరాబాదు, పూనా, అహ్మదాబాద్, లక్నో, అలహాబాద్, బెంగుళూరు, కలకత్తా, కాన్పూరు నగరాలలో బ్రహ్మాండమయిన సభలు నిర్వహించి, వేల సంఖ్యలో పాల్గొని ముస్లిమ్ పర్సనల్ లాకు మద్దతుగా బలోపేతంగా నిలబడ్డారు. షరీఅత్ చట్టాల పట్ల తాము పూర్తిగా సంతృప్తిచెంది ఉన్నామని, తమ సమస్యల పరిష్కారానికి కేవలం ఆ చట్టాలే చాలని ఘంటాపథంగా, విశ్వాసం ఉట్టిపడే కంఠంతో ఎలుగెత్తి చాటారు.

ముస్లిమ్ పర్సనల్ లా ప్రాముఖ్యత, దాని ధార్మిక ప్రాతిపదిక రీత్యా, ఇంకా దానికి అనుకూలంగా ఉన్న ముస్లిమ్

ప్రజాభిప్రాయం దృష్ట్యా దాన్ని మార్చాలి లేక రద్దు చేయాలన్న డిమాండు ఎవరి తరఫున వచ్చినా అది సరైనది కాదు. ముస్లిములనబడే వర్గానికయితే ఎవరికీ ఇటువంటి డిమాండు ఏ విధంగానూ శోభించదు. ఇకపోతే; ముస్లిమేతర సోదరుల మాటకు వస్తే వారు ముస్లిముల సమస్యలను, వారి ఇబ్బందులను చిత్తశుద్ధితో అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తే ముస్లిముల యెడల వారంతటవారే ఉదార వైఖరికి సంసిద్ధమవుతారు. ముస్లిమ్ పర్సనల్ లా విషయంలో ముస్లిముల వైఖరి పట్ల వారికి ఉన్న అనుమానాలు కూడా తొలగిపోతాయి. పైపెచ్చు పర్సనల్ లా అవలంబన వారి (ముస్లిముల) ధార్మిక బాధ్యత అన్న సంగతిని వారు గుర్తిస్తారు. ఇదే విధంగా ప్రభుత్వం కూడా ముస్లిముల భావాలను సరిగ్గా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి. ఇస్లాం ధర్మంలో జోక్యంగా పరిగణించబడే ఎటువంటి చర్యనూ అది ముస్లిమ్ పర్సనల్ లా విషయంలో చేపట్టరాదు. దీనికి బదులు అది సాధ్యమైనంతవరకు మత, సాంస్కృతిక స్వేచ్ఛను రూఢపరచి తద్వారా ప్రజాస్వామ్య పటిష్టతకు మార్గం సుగమం చేయాలి.

## సంస్కరణకు సరైన విధానం

ముస్లిమ్ సమాజం ధార్మికంగా లోనయి ఉన్న అధోగతి మూలంగా దాని సామాజిక జీవనంలో కూడా రకరకాల చెడుగులు పట్టుకువచ్చాయన్న సంగతి త్రోసిపుచ్చలేనిది. పురుషులు స్త్రీల హక్కుల్నిగాని, స్త్రీలు పురుషుల హక్కుల్నిగాని సజావుగా నెరవేర్చటం లేదన్నది నిజం. కుటుంబ అధిపతి అయిన దృష్ట్యా

ఇస్లామ్ మగవాడికి ఇచ్చిన విస్తృతాధికారాలు దుర్వినియోగమవటం కూడా కద్దు. అయితే దీని బాధ్యత ఇస్లామ్‌పైగాని, షరీఅత్‌పైగాని రాకూడదు. దీని బాధ్యత అంతా నిజానికి సమాజ సభ్యులపై పడుతుంది. ఎందుకంటే పరిస్థితుల ఈ వికృత స్వరూపం వాస్తవానికి ఇస్లామ్ బోధనలను పాటించకపోవటం వల్లనే ఏర్పడింది. అందుచేత ఈ చెడుగుకు బాధ్యతనంతా షరీఅత్ శాసనాలపైకి నెట్టేసి, సంస్కరణ నిమిత్తం ఇస్లామేతర చట్టాలను ప్రయోగించే తిరకాసు చికిత్స ఎంతమాత్రం ఆరోగ్యకరం కాదు. ఆ మాటకు వస్తే ముస్లిముల జీవితంలో చెరుపుకు గురికాని క్షేత్రం ఏది మిగిలింది గనక? ఈ విధంగా ప్రతిదానికీ షరీఅత్ శాసనాలపై బాధ్యత మోపుతూపోతే ఆఖరికి ఇస్లామ్‌నే విడిచిపెట్టేసి ఆధునిక నాగరికతలోనే రోగాలన్నింటి చికిత్సను వెతకవలసి ఉంటుంది. ఇస్లామ్ పట్ల కుశంకలూ, ఆధునిక నాగరికత పట్ల తియ్యని కలలా? హాలాహలాన్ని అమృతంగా భావించటం అంటే ఇంకేమిటి?

సమాజాన్ని సంస్కరించాలనే అనుకుంటే, ప్రజల్లో పాపభీతిని దైవభక్తిని పెంపొందించాలి. అందుకుగాను ఇస్లామ్ బోధనలను వారికి వివరించాలి. వారిలో నైతిక భావనను మేల్కొల్పడానికి, జీవిత పరమార్థాన్ని వారు గుర్తించేలా చేయటానికి ప్రయత్నించాలి. సమాజ సంస్కరణ కోసం ఈ నైతిక విప్లవం ఎంతయినా అవసరం. అప్పుడే వారు ఇస్లామ్‌ను ఓ జీవన వ్యవస్థగా నమ్మి అవలంబిస్తారు. అప్పుడే జీవితపు అన్ని క్షేత్రాల్లోనూ ఖచ్చితంగా దాన్ని అనుసరించగలుగుతారు. అయితే సమాజంలోని ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా, షరీఅత్ అన్వయింపు

సరిగా జరుగుతున్నదా అన్న విషయాన్ని పరిశీలించాలి. ముఖ్యంగా నేడు ముస్లిమ్ స్త్రీలకు ఎదురవుతున్న పరిస్థితుల దృష్ట్యా తలాక్, ఖులా తదితర సమస్యలను పరిశీలించి ఈ సందర్భంలో ముస్లిమ్ మహిళలకు ఎదురవుతున్న సంక్లిష్టతను అధిగమించేందుకు మార్గాలను వెదకాలి. కాల పరిస్థితుల దృష్ట్యా షరీఅత్ అభిమతాన్ని నెరవేర్చే దృష్టితో— ఖుర్ఆన్ హదీసుల హద్దుల్లో ఉంటూ— ఎదురవుతున్న కొంగ్రొత్త సమస్యల పరిష్కారాలను అన్వేషిస్తే, తదనుగుణంగా నియమాలను రూపొందించుకోదలిస్తే అందుకు నిస్సందేహంగా ఇస్లామ్‌లో అవకాశం ఉంది. అయితే ఈ పని దారినపోయే దానయ్య చేసేది కాదు. ఆధునిక నాగరికత చేత మోహించబడినవారు, రాజకీయ స్వలాభాల కోసం పాకులాడుతున్నవారు కూడా ఈ బాధ్యతను నిర్వర్తించలేరు. ఇటువంటి వారేగనక 'ఇజ్తిహాద్' (షరీఅత్ అన్వయింపు శాస్త్రం) కొరకు ఉపక్రమిస్తే షరీఅత్ రూపురేఖలనే మార్చివేస్తారు. బాధ్యతాయుతమయిన ఈ కార్యాన్ని విస్తృత ధర్మజ్ఞానం, అందులో అంతర్ దృష్టిగలవారు, భయభక్తులు, నిష్ఠాగరిష్ఠ జీవితం గడిపేవారు, వర్తమాన పరిస్థితుల అవగాహన గలవారు మటుకే ఈ మహత్కార్యం చేపట్టగలరు. దైవకృప వల్ల ముస్లిమ్ సమాజంలోని ఇలాంటి సజ్జనులు దీనివైపు శ్రద్ధ చూపుతున్నారు. ముస్లిమ్ విద్వాంసులు ఈ విషయమై సామూహికంగా సమాలోచనలు జరుపుతున్నారు. నేడు ఎదురవుతున్న సమస్యలకు వారు సర్వోత్తమ పరిష్కారాలు సూచిస్తారని ఆశించవచ్చు.

—: సమాప్తం :—